# మధుజీవనము



కడిమిళ్ల
వరప్రసాద
శతావధాని

కళాప్రపూర్ణ
మధునాపంతుల
సత్యనారాయణశాస్త్రిగారి
పద్యరూపజీవితచిత్రణము



ప్రచురణ
ఆంధ్రకేసరి యువజన సమితి
రాజమహేంద్రి



గ్రంథకుసుమం - 3

# మధుజీవనం

(కళాప్రపూర్ణ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారి
పద్యరూప జీవితచరిత్ర)

రచయిత

కడిమిళ్ళ వర ప్రసాద శతావధాని

ప్రచురణ

పబ్లికేషన్ డివిజన్

ఆంధ్ర కేసరి యువజన సమితి

రాజమహేంద్రి

1992

"మధుజీవనం"

రచయిత :

కడిమిళ్ళ వర ప్రసాద శతావధాని,
టేలరున్నత పాఠశాల,
నరసాపురం.

ప్రథమ ముద్రణ మార్చి 1992

ప్రచురణ

పబ్లికేషన్ డివిజన్
ఆంధ్ర కేసరి యువజన సమితి
విక్రమహాల్
రాజమహేంద్రి
533 104. ఆం. ప్ర.

రూ. 20/-

కవర్ డిజైన్ - బాపు

కవర్ ప్రింటింగ్ - ఈశ్వర ఆఫ్‌సెట్
రాజమహేంద్రి

ప్రింటింగ్ - నవజ్యోతి ప్రెస్, శివాలయం వీధి,
న ర సా పు ర ం.

# మ రో ముం ద డు గు ...

రాజమహేంద్రి ఆంధ్ర కేసరి యువజన సమితి వివిధ సాంఘిక, సాహిత్య, సాంస్కృతిక కార్యక్రమాల్లో ప్రజావళికి తమవంతు సేపలంది స్తున్న విషయం అందరికీ తెలిసినదే. తమ సేవలు ప్రతిబింబించే విధంగా కేసరి, సారమతి, అశీతి, రత్నావళి ప్రత్యేక సంచికలు రూపొందించింది.

1986 నుండి సమితి ప్రచురణ విభాగము ప్రారంభించి అమూల్య మైన 'హితసూచని' గ్రంథమును ప్రచురించినది. 1987 సం॥లో సమితి రజతోత్సవ సందర్భంగా "ప్రభవ" ప్రత్యేక సంచికను ప్రచురించింది.

మధునాపంతుల వారి దివ్య హస్తాలతో ప్రారంభింపబడిన ఆంధ్ర కేసరి యువజనసమితి కృతజ్ఞతా పూర్వకంగా వారి జీవితచరిత్రను ముద్రిం చడం విధిగా భావించింది. అందుకే శ్రీ కడిమిళ్ళ వరప్రసాద శతావధానిచే రచింపబడిన 'మధుజీవనం' ముద్రించి మీ కరకమలములకు అందించాము.

ఈ పుస్తక ప్రచురణతో మా సమితి మరో ముందడుగు వేసింది. ఏ కార్యక్రమం చేపట్టినా సమితి సభ్యులందరి సహకారంతోనే, సభ్యుల అంకిత భావమే కార్యక్రమాల విజయాలకు మూలం.

"మధుజీవన" ముద్రణకు ఆర్థిక, హార్దిక సహకారములందించిన వారందరికీ కృతజ్ఞతలు.

సదా మీసేవలో
- అ రి పి రా ల

# చదివే ముందు...

ఒక్కమాట, మధునాపంతులవారి కవితామూర్తి నాకు స్ఫూర్తి. శ్రీ త్రిపురానందనాథ గురుదేవుల ఆశీస్సు నా కవిత్వానికి ఉషస్సు. కీ॥ శే॥ మంతిన వెంకన్నపంతులు నా చైతన్యం. విట్టల రత్నాకరం నా ఊపిరి.

సి హెచ్. రెడ్డప్పధవేజి, సి హెచ్. సుబ్రహ్మణ్యశాస్త్రి, కె. వి. లక్ష్మీ నరసింహం, ఎమ్. శ్రీను వీరంతా చేదోడు-వాదోడు. అర్థాంగి మీనాక్షి నిజంగా బెటర్‌హాఫ్.

ఇద్దరు డాక్టర్లు ప్రసాదరాయ కులపతి, బేతవోలు రామబ్రహ్మం గారలు నాలోని కవిని ఆరోగ్యంగా ఉంచే వారు. వీరంతా ఈ కావ్యరచనకు కారకులైతే-

రాజమహేంద్రి-ఆంధ్ర కేసరి యువజన సమితి ఈ కావ్యానికి వెలుగు నిచ్చారు. శ్రీ వై. యస్. నరసింహరావు, డా॥ ఎ. నారాయణరావు శ్రీ ఎమ్. సాంబశివరావు, శ్రీ పి. రఘునాథ్ సారథ్యంవహించారు.

తండ్రిగారి జీవిత క్రమాన్ని శ్రీ ఎమ్. వి. చలపతిగారు వివరించారు. బాపుగారు 'బాపురే' అన్పించారు.

నవజ్యోతి వారు కళ్ళల్లో జ్యోతులు పెట్టుకొని అచిరకాలంలో అందించారు. వీరందరి విషయంలోను కృతజ్ఞతలు.

ఏ మామ అయినా తన అల్లుడు ఒక హీరోలా ఉండాలనుకుంటాడు. నిజంగా నా కావ్య కథానాయకుడే (మధునాపంతులవారు) నా కృతికి భర్త అయ్యారు.

మన్యేఽహం ధన్యమాత్మానం

- కడిమిళ్ళ.



1962 సం॥లో

ఆంధ్ర కేసరి యువజన సమితి స్థాపించిన సందర్భంలో -

కళాప్రపూర్ణ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి గారు

వ్యవస్థాపక కార్యదర్శి - శ్రీ వై. యస్. నరసింహరావు



1968 సం॥లో

సమితి గౌరవ సభ్యులు నేటి భారత ప్రధాని

శ్రీ పి. వి. నరసింహారావు

రాష్ట్ర విద్యాశాఖ మంత్రిగా ఆంధ్ర కేసరి చిత్రపటావిష్కరణ

నన్ను మన్నించి "మధుజీవనము" రచించె
రమ్యగతి, కడిమిళ్ళ వరప్రసాద
శతావధానికి నాకృతజ్ఞతను తెలిపి
చెప్పుచున్నాడ మంగళాశీర్వచనము.

- మధునాపంతుల



# అలమతి విస్తరేణ

"కళాప్రపూర్ణ" శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారంటే మా సోదరుడు కడిమిళ్ళ వరప్రసాదుకి మొదటినుంచీ చాలా అభిమానం. ఆ అభిమానం ఎంతటిదంటే ఇదిగో "మధుజీవనం" వంటి మహాకావ్యం ఆవిర్భవించింది.

కవిత్వం ఆకర్షించడమో కావ్యాలు ఆకర్షించడమో ఉంది. ఇక్కడ అదొక్కటే కాదు. మధునాపంతులవారి వ్యక్తిత్వం కూడా మా సోదరుణ్ని బాగా ఆకట్టుకుంది. అందుకని వారి జీవితచరిత్రనీ సాహితీమూర్తిమత్వాన్ని మిళాయించి తనివితీరా ఆరు ఆశ్వాసాల ప్రబంధం అలవోకగా సంతరించి వదిలి పెట్టాడు. ఇదొక తృప్తి. అంతకంటే సత్కవి ఋణమీగుపొంటే - ఇదొక సత్కృతి.

సమకాలంలో ఉన్న ఒక కవి జీవిత చరిత్రని ఇతివృత్తంగా తీసుకుని వారి కావ్యాలను సమీక్షిస్తూ పద్యకావ్యం నిర్మించడం నాకు తెలిసినంతవరకూ తెలుగు సాహిత్యలో ఇదే మొదలు. ప్రథమ తాంబూలం వరప్రసాద శతావధానిదే

వర ప్రసాదును గురించి పరిచయవాక్యాలు అవసరంలేదు. గురుకుల క్లిష్టః ప్రసాదః కవిః. అష్టావధానాలూ శతావధానాలే అతడికి పరిచయ దర్పణాలు. ఉత్తమాః స్వయమాఖ్యాతః అన్నారు. అయితే ఇది అతడు ప్రచురిస్తున్న మొదటి పద్యకృతి. ఇటువంటివీ ఇంతకు మించినవీ - వాసిలోనూ రాసిలోనూ - వరప్రసాదు ఇంకా రాయాలి ఒక కసిగా రాసి గుప్పించాలి. భవతు.

అతనికి దీర్ఘాయువు క
ల్గుత దేవతలు వానిఁ గూరిమితోఁ జూ
చుత కైతలు పెక్కులు వ్రా
యుత కీర్తి గడించి సౌఖ్యమొందుత సతమున్ (పుట-60)

ఈ మధుజీవనం ఆరుపాయలుగాసాగింది. మొదటి మూడుపాయలూ మధునాపంతులవారి జీవితచరిత్ర. శుకవాణీ చతుర్ముఖుల సంభాషణగా కావ్యమంతాసాగింది. మొదటి రెండు ఆశ్వాసాలలోనూ ఆనందప్రదమైన జీవిత ఘటాలను సరస్వతీ దేవి చెబుతుంది - చిలుక వింటుంది. మూడవ

పాయలో మధునాపంతులవారికి భార్యావియోగంవంటి విషాద ఘట్టాలు వస్తాయి. అందుకని ఈపర్వాన్ని విరించినోట పలికిస్తుంది సరస్వతి. రస భావాదికం ఎంత ఉన్నా ఔచిత్యమే కావ్యానికి జీవగఱ్ఱ-

రసమున్నను ధ్వనియున్నను
బసగలిగిన రీతులున్న వక్రతయున్నన్
వెసనెన్ని గుణములున్నను
నసదే యౌచిత్యమొకటి యగుపడకున్నన్। (పుట-109)

మరొక గొప్ప ఔచిత్యమేమిటంటే మధునాపంతుల వారి కావ్య సృష్టిని - ప్రధానంగా ఆంధ్రపురాణాన్ని తాను సమీక్షిస్తున్నట్టు కాకుండా వాల్మీకి వ్యాసుడు మొదలైన సంస్కృత కవులూ నన్నయాది తెలుగు కవులూ సమీక్షిస్తున్నట్టు చిత్రించడం. నాలుగూ అయిదూ ఆశ్వాసాలు దీనితో నడిచాయి.

ఆరవ ఆశ్వాసం అలంకార పరామర్శ. ఇక్కడ అంతా భరతుడు మొదలుకొని "దర్విడశిశువు" వరకూ సంస్కృతాలంకారికులు స్వయంగా ఆంధ్రి పురాణం మీద చర్చజరిపారు. అందులో ఉన్న వివిధ ప్రస్థానాలను ప్రస్తావించి సంబరపడ్డారు.

ఈతీరు కథాకథనం వల్ల ఒక గొప్ప పరిబంధ ధ్వని లభించింది - ఆంధ్ర పురాణం అటు కవులనూ ఇటు విమర్శకులనూ శతధా సహస్రధా సంతృప్తి పరచగల ప్రామాణిక మహాకావ్యము - అని.

మరొక విశేషం — ఈ "మధుజీవనం" అనుపరిబంధం. ఊహ తెలి యంగల పోచిరపెద్ది సుబ్రహ్మణ్యం మా వరప్రసాదుకి గురునాథుడు. పద్యాలు పంచకళ్యాణి గుర్రాల్లా కదనుతొక్కాయి. ఆ సొగసులు విప్పి చెప్పాలని మహా ఉబలాటంగాఉంది. కానీ అలమ్ అతి విస్తరేణ అన్నారు. ఔచిత్యం నేనూ పాటించాలిగదా!. ఈకావ్యాన్ని మధునా పంతుల వారికే అంకితం చెయ్యడం మరొక మంచి ఔచిత్యం. ఉభయులూ ధన్యులు, వయంతు పాఠకా ధన్యతమాః సెలవు.

భవదీయుడు

తెలుగు విశ్వ విద్యాలయం,
రాజమహేంద్రి.

బేతవోలు రామ బ్రహ్మం
ప్రొఫెసర్ ఆఫ్ తెలుగు.

# కథా సంగ్రహం

ఆయ్యేది వేదములకు స్థానమైన సత్యలోకం. బ్రహ్మను ఆనంద పరుస్తోంది భారతి వీణావాదనంతో. ఉన్నట్టుండి విరించి నిర్వికల్ప సమాధి లోకి వెళ్లిపోయాడు. హంస వాహిని కినుక బూనింది. అదృశ్యమయింది. గాలి తాకున వీణతంత్రులు కదలి ధ్వనిస్తున్నాయి. శ్రుతి భేదం ఏర్పడి కనులువిచ్చాడు విధాత. వీణ తప్ప వాణి కనబడలేదు. వెదికాడు. పిలిచాడు. పరిదేవనం చెందాడు. ఏకవుల చెంత చేరిందోఅని అందరి పేర్లతో పిలిచినా పలకలేదు. గౌతమీ తీర కవులకేసి దృష్టి మళ్లించాడు. మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రివద్దకు చేరిఉంటుందని ఊహించాడు. ఆ కవి కవిత్వ రూపమైన వాణిని ప్రశంసించి, ప్రార్థించాడు.

అప్పుడు దృగ్గోచరమయింది శారద. ప్రణయ కలహం తీరింది. నిర్వికల్పం శివుని మార్గం. మీరుండవలసింది సవికల్పంలోనే అనిచెపుతుంది. పరస్పరం అనురాగ వర్షాన్ని కురిపించుకొంటారు.



# సత్యలోకము

## ప్రథమాశ్వాసము

1) శ్రీ గృహిణీ మహీ గృహి. విరించి సమంచిత పుత్రి వద్యశ
శ్రీగణనీయతానవధి. సేవక సేవధి. దేవ దేవు. స
ద్యో గజ బంధ మోక్ష కృదయోదయ సాదరభావు గొల్తు. స
ర్వాగమ వర్ణనీయ మహిమాధికతాధిగమేప్సితాప్తికిన్।

2) తెల్లనివాఁడు. జూటమునఁ దేనియ లొల్కెడి చెందమామ రా
జిల్లెడివాఁడు. కంఠమునఁ జేదగు హాలహలమ్ము గూడ వ
ర్తిల్లెడివాఁడు. నాయెడద దేవళమందు వసించి, గంగ వ
ర్తిల్లెడి నాటి యా సొగసు తీరిచి, దిద్దుత కబ్బమందునన్।

3) మధునా పంతుల వంశ వారిధి శశిన్, మా సత్యనారాయణున్
మధుకోశోపమ భావ భోగరతి ధీమంతున్. యశోవంతు, స
న్నిధి కల్పించి. తరింపఁజేయఁదలఁతున్ విచ్చల్ హయగ్రీవు, వే
దధునీ మూలగిరిన్. రమాధవు. జగత్త్రాణైక దక్షున్ హరిన్।

4) పెద్దది పొట్ట విద్దియల పెట్టియ కా, విడు పాటి తొండమా
బుద్ధులకెల్ల నూపిరియ. పూజ్యుల పల్కుల నాలకింపఁగా
పెద్దవియైన వీనులును. పిన్నలౌ కన్నులు, బాహ్య దృష్టియే
వద్దనుచున్న యొజ్జలగు వాఁడు గణాధిపుఁడిచ్చు దీవెనల్।

5) తల్లీ! నీదయ యున్న(జాలు, విలసత్కావ్యాళ్య సౌధాగ్ర వి
ద్యు ల్లాస్యమ్మల తోడ నాటుకొని, సంతోషించు నాంధ్రీపురం
ధ్రుల్లాసమ్మున కేను గారకు(డనై యూరించి, యూరించి, రం
జిల్లం జేసెద( దెల్లవారి యెదలన్ శ్రీ వాక్పతీ! భారతీ!

6) నానాకావ్య విశిష్ట తత్త్వముల సంధానింప(గా నెంచు మా
లోనన్ వ్యాకరణాత్త శిష్ట కవితా లోకంబు, వ్యుత్పత్తినా
ధానింపన్ గృషి సేయు( ద్వద్గుణ మహత్త్వం బెంచి, శ్రీపాద ల
క్ష్మీ నారాయణ శాస్త్రివర్య! భవదంఘ్రి ద్వంద్వమున్ మ్రొక్కెదన్!

7) అవధానంబులనే విధానములు వ్యాహారించునో నేర్పి, స
త్కవితా లాలసతన్ సృజించి, హృదయ గ్రంథాన నార్షేయ భా
వ వినూత్న ప్రతిభా నిధింబలెనమా వాసించు విద్వత్సదా
శివ! రావూరి వరాన్వయామృతకరా! శ్రీ వేంకటేశా! నతుల్!

8) ఆర్య జనాభిరామ హృదయాంబుజముల్ వికసింప జేయు జ్ఞా
నార్యము(డయ్యు నత్తిలి కులాంబుధి చంద్రుడు(డు, సాటిలేని ధీ
వర్యు(డశేష శిష్య గణ వందిత పాదు(డు నైన కృష్ణమా
చార్యగురుండె దిక్కు, గురు సన్నిధి సన్నిధి నాకు నెప్పుడున్!

9) కవితోత్సాహము కల్గ( జేయుటకు దీక్షంబూని, గోర్మద్దలన్
జవి చూపించి, కళామృతమ్ము తొలి భిక్షన్ బెట్టి, నేడీ రసో
ద్భవ కావ్యానకు స్రష్ట( జేసిన ఘనోపదర్శిష్ట వంశాబుధిన్
గవి చంద్రుండగు రామలింగనికి నే( గైమోడ్పు గావించెదన్!

10) కోటారావను నాలుగక్కరములే కొండంత యుత్సాహమున్
మూటం గట్టి శిరంబుపై నిడి, కళాపూర్ణుండ పై సాగి, ము
ప్పేటల్ పేనుమ శబ్ద భావరసముల్, వెల్గొందుమా యంచు, వా
గ్ఘాటమ్ముల్ గయి నేసి నట్టివి శిరస్థానీయముల్ సేవ్యముల్।

11) నను లాలించుచుఁ గైతలో తెలుగు విజ్ఞానంబు గై నేసి, జ్ఞా
నిని సేయున్ జలమూని విద్దియుల బోణిన్ గుండెలో నిల్పి, తా
నిని జన్మనకుఁ గూర్చ నర్హమగు శ్రీవిద్యన్ బ్రసాదించి, క్రొ
న్ననగా నాకొక రూపు దిద్దుఁ ద్రిపురానందా! నమో వాకముల్।

12) శ్రీ కౌండిన్యస గోత్రి సంజనన సచ్చిత్రార్ష సంస్కార భా
షాకైవల్యుని, శేషయాహ్వాయ తపస్సంపత్ప్రసూతిన్, గుణా
నీకున్, వేంకట రామశాస్త్రి జనకున్, నిష్ఠామతల్లిన్, బతి
ప్రాకారావృత భారతీ జనని సద్భక్తిన్ బ్రపూజించెదన్।

13) కడిమిళ్ళ వంశమందునఁ
దొడ సూపిన కవిని నేను బూజ్యులు పెక్కం
డ్రుడుపతులై కవనాబ్ధికిఁ
గడుపుం బంటైన వారు కవితా గురువుల్।

14) నేను వరప్రసాదుఁడను నిక్కము భారతి తల్లి నాకు వి
జ్ఞానులు నాకు దేశికులు, సాహితి యేహితమైన యట్టి వా
రే ననుఁ గూడు మిత్రులు నదేగద నన్ను శతావధాన మా
ర్గాన గమింపఁ జేసెనవురా! జనికెంతటి భాగ్యమోగదా!

15) నా యాంతర్య మెఱుంగఁ జట్టు, కనుసన్నల్ దాటదెన్నండు, వి
ద్యా యోషా హృదయారవింద రవియై దట్టించి పద్యమ్ములన్
వ్రాయున్, కోచిన పెద్ది వంశజుఁడు సుబ్రహ్మణ్యుఁడే లేఖకుం
డై యుండన్ బలుకాఁడు చుంటిఁగృతి శిష్టాశీః ఫలావాప్తిచేన్।

16) మధునా పంతుల వంశాం
బుధిశీతాంశునకు, సుగుణముల ప్రోవునకున్,
మధు మధు కర మధుప ప్రతి
నిధికిన్, గవితా ప్రభావ నిష్ఠిత మతికిన్।

17) కవికుల తిలకునకున్, భా
ర్గవ గోత్ర పయోధిసిద్ధ రత్నమ్మునకున్
భవతారక భావుకునకు
స్రవదమృత సమాన శబ్ద సౌరభ కృతికిన్।

18) ప్రకటిత హృదయోజ్జ్వల గుణు
నకు, గురుజన నతికి సత్యనారాయణ నా
మకునకుఁ, గలితక విశ్వా
ర్థ కృతీశ్వరునకు రసాత్మ తత్పర మతికిన్।

19) చైత్రరథ సారథికి, వా
క్చిత్రిత సర్వ ప్రపంచ సేవారతికిన్,
గోత్ర పవిత్రునకు, వచో
ధాత్రికి, శ్రీఖండ భావ ధన ధవళునకున్।

ఆంధ్రీ పురాణ కవీంద్రున
కాంధ్ర మహావంశ వైభవాఖ్య కృతికిన్
సంధృత వర కవితా నీ
రంధ్రునకును భావ వేద రాజత్కృతికిన్. 20

బహుకవి నుతునకు విద్వ
న్మహితునకు ధ్రువునకు ధైర్య మందర మతికిన్
విహరత్కవితా వనితా
రహస్య లాలసునకు, శివ రత తత ధృతికిన్. 21

అంకితమ్ముగ నేను వ్రాయందలంచి
రామునకు రామ చరితమర్పణము వోలె
శారదకుఁ బ్రిబంధపు పూలజాలు వోలె
భావ హృదయాంజలు లొసంగి పట్టుఁబట్టి. 22

మధునా పంతుల జీవన
మధువులు మధుజీవనముగ మలచెదు వేళన్
మధు నిష్యందిని శారద
విధి సహితగ నిలిచె హృదయ పీఠిన్ బ్రేమన్. 23

## కథారంభము

అది వేదమ్ములకిక్కయై వఱలు దివ్యమ్మైన లోకమ్ము. ప్రాఁ
జదువుల్ నాలుగు మోముదమ్ములను నిచ్చల్ వల్కుచున్, దమ్మియే
సదనంబై మను దమ్మిపుట్టువునకున్, షట్కర్మలం దన్ను శా
రదకున్ గచ్ఛపి మేలి నేస్తము ముహూరాగానుసంధాయితన్. 24

కచ్ఛపీ రాగ మధురతా గరిమఁ గాంచి
చిలుక పలుకులన్ గొంగొ్రొత్త కులుకులెంచి
ఉవిద సొగసులు చూచి, బింబోష్ఠమాని
తనిసి పంకించుచుండును దలలు నలువ। 25

అట్టి చతురాస్యుఁడొకనాడు ధ్యాన ముద్ర
వడసి యెంత పిల్చిన మారు వలుకఁడాయె
నిర్వికల్ప సమాధిలోనికి గమించె
అక్షరాంగనలో విరహమ్ము మించె 26

భారతి కోపమూని, తన ప్రాణవిభున్ విడనాడి, వల్లకిన్
నీరజ పీఠిపై నిలిపి, నేను వచ్చెదనంచు సిద్ధమౌ
కీరము నక్కడే యునిచి, కిన్కకు సాక్ష్యము గాఁగఁ బాద సం
చారము సేయుచున్ వెడల సాగినదంచను బిల్వకుండఁగన్। 27

గాలి తాకునఁ దంత్రులు కదలుచుండ
వింతరాగాలు పలుకులు వినుచుచుండ
కచ్ఛపికి మారు రాగాలు కలిగెనేల?
అనెడు సంశయమజునకు మొనలు సూపె। 28

నిర్వికల్ప సమాధి సంనిష్ఠమయిన
చిత్తమందుననొక వింత చేతనమ్ము
క్రమము క్రమముగఁ గల్గిన కంజసూతి
గనులు విచ్చెను, వీణియ కానఁ బడియె। 29

పద్మభవుండు లేచి, పదపద్మములానఁగ సత్యభూస్థలిన్
బద్మవిభాననన్ నయనపద్మములన్ గనరాక, వీణియున్
సద్మమునందుఁ జూచి యవిచారవిదూరతరాంతరంగసం
విద్మరుఁడై సరస్వతి గవేషణసేసె చికీర్షితాప్తికై। 30

చూడు సరస్వతీ! కనులఁజూడుము నన్నొక మారు, మారువి
లోపడుములేచి, మద్ధృదయభూమికనగ్నిగిరుల్ సృజించెడిన్
వాడిమగంటిమిన్ నెఱపి, వల్లభు నన్ గరుణావలోకనన్
జేడియ! మేను మేనున యజింపఁగ స్వర్గసుఖాధ్వరంబులన్। 31

రావే! పలుకుల కలికీ!
జీవములు నిలుపఁగరావె! చిలుకల కొలికీ!
రావే! కరణింపఁగనను
భావిని! మృదుభావ! భావభవు పూములికీ! 32

అనుచు హృదయంబు కరిగించునటులఁ బల్కి
వెదకి వేసారి తిరుగునవ్వీధికి ముందు
రససరస్తటీ సుమలతా లాలనముల
కనుల వెలిగించెనొకచోటఁ గైతనెలఁత। 33

ఆంధ్ర సాహితీ భావ వేదాగమములు
తనువు పులకింపనాత్మ సంధానపఱచి
గౌతమీ తీర కవులను గౌరవించు
భావమొకయింతఁ బసిగట్టి పద్మభవుఁడు। 34

ఆంధ్రసాహిత్య గగనాశ్రయమ్ములైన
సూర్య చంద్ర నక్షత్ర తుల్యార్యకవుల
భావ వైయక్తిక విశిష్ట పథములరసి
వాణినభిముఖిఁ బొనరింపఁ బలుకరించె। 35

ఆంధ్రసరస్వతీ! తనువియత్తటిదర్థ విలాస లాలసా!
రంధ్రికలిట్టికోపములు ప్రాణసతీ! వినుమొక్కమాట, పౌ
రంధ్రిక చిత్తతత్త్వపు కలాపములాపుము పేర్మినింపుమీ
వాంధ్రి పురాణ కావ్య గగనాంబుద భావ మధు ప్రవర్షిణీ! 36

కపురంపుం జడివానలీనుఁ గవితా కైవల్య శబ్దాగమా
ర్థపుఁ దీయందనముల్ గగుర్పొడిచి, సంతానింప నేత్రాంబువుల్
చపలాక్షీ! కనుమాంధ్ర సంగత హరిశ్చంద్రాశ్వమేధాధ్వరాం
ధ్రపురాణోదయ పర్వ-పర్వ హృదయ దర్శివ్యమ్ము లక్షించుచున్। 37

నెనరుం బల్కుల దీపకర్ణిసుతు సాన్నిధ్యమ్మునందున్గుణా
ఢ్యుని వైదగ్ధ్యమవజ్ఞకై గడఁగు రాట్టున్గాంచి, కావ్యమ్మున
గ్నినివి సంధించెడు నాటి చిత్రకృతులీక్షింపంగదే, శాత వా
హనపర్వాక్షర కాంతికాంతహృదయా! వ్యాఖ్యాన భావోదయా! 38

వాక్యములంతరమ్మననవారితరీతిఁ జరింపఁ జేసి, చా
ళుక్య ధరాధినాధునవలోకన వాకొనఁబూవి భారతా
శక్య కృతి ప్రబంధమున సాగిన నన్నయ కంఠపీఠి! చా
ళుక్య సుపర్వ భావ పరిలోల మనస్విని! నన్నుఁ జూడవే! 39

భారత ధర్మ సంకలిత భావన దీవెన కాఁగఁ బాలనన్
నేరుపు కల్గి, భావకున నించుఁ బ్రజన్ నిజ సంతతిన్ బలెన్
పౌరుష కాకతీయ నృపపండిత కోటి, తదుక్త మంజువా
చారతి! భారతీ! కవిచఃప్రియ! కాకతి పర్వ తోషితా! 40

భారత ధర్మ పథంబుల
తీరులమర్చుచుఁ బునఃప్రతిష్ఠా పర్వ
శ్రీరాజ వంశ గాథల
శారద! సేవించెద విను శాంతింపఁగదే! 41

మౌని విద్యారణ్య మంత్ర విద్యా శక్తి
          యక్షరాక్షర భావ భిక్షనొంది
సోమనాథుని నాల్క సూత్రితాక్షర పంక్తి
          రాజరాజుల చేతఁ బూజలంది
డిండిమ శ్రీనాథ పండిత ప్రతివాద
          శబ్ద నృత్య విలాస చణతనొంది
శ్రీనాథ కనకాభిషేకోత్సవ వినోద
          రోమహర్షణ భావ రుచులనంది
సరస కవితా సతీ పాద సారసోక్తి
సౌరభ మహానదీ క్షీరసాగరోప
మాథ్య పినవీరభద్ర భావానుగమ్య!
వెడలి విద్యానగర పర్వ విదుషి రావె! 42

పెద్దన ముఖ్యసత్కవుల పెన్నిధి పెన్నిధియై చరించి నీ
ముద్దగుఁ జెక్కటద్దముల భూషలు క్రొత్తపరిబంధ పద్ధతుల్
దిద్దిన కృష్ణరాయ భుజ దీప్తులు దీపములై వెలుంగనో
పద్దెపుచేడియా! విజయపర్వ విధాయిని నన్వధింపవే! 43

కాలికి గజ్జెలు గట్టిన
ఏలిక శ్రీవిజయరాఘవేశ్వరు సభలన్
బాలించిన భామిని! పలు
కాలింపవె, సుకవి పోషణాతుర హృదయా! 44

నన్నయ కంఠ సంతానంబు సృజియించు
నీనేర్పులననుసంధించి చూపి
శ్రీనాథ కంఠ ఘంటానాద మహిమంబు
వెలయించు నీశక్తి వెలువరించి
కృష్ణరాయలకావ్య కీర్తి ధ్వజౌన్నత్య
మూలశక్తి విను పద్యాల నిలిపి
తిరుపతివేంకటేశ్వరుల పల్కులఁ గుల్కఁ
బంట నీకును రెండు ఫలములొసఁగి
గోపికానౌక నిన్నెంత కుదురు పరచె
ప్రతియుగాదికి భావనా పల్లవములు
పలుకరించు సమాగమ భారతోక్తి
నీకు శ్రీకంఠతాంబూల విధి నొసంగి। 45

నీదునక్షరాకృతినాత్మ నిలుపుకొనిన
కవుల భావనమస్కార గౌరవములఁ
దనువు పులకించు రససిద్ధి తత్త్వమీవు
కనులఁ గరుణించి, నను జూడు కైతకన్నె! 46

మధునాపంతులకవి మధు
విధి యజమానిని! రసధ్వని నియత కవితా
మధునిష్యందిని! పలుకవె
మధువులు చిలుకఁగ విసువక మన్నన నన్నున్। 47

విధివాక్యానుగనిష్ఠనున్న ననునావేదింప న్యాయంబె య
మ్మధునాపంతులశాస్త్రి కావ్య రచనా మాధుర్యముం గ్రోలు వా
ణి ధరన్ దర్శన సార సాంబశివ పన్నీరాజ్య పంచాశికా
మధు సంసారములేమిసెప్పు? కవి ధామ ప్రౌఢ పాదాంబుజా! 48

కలికీ! శుక వాహను పూ
ములికీ! పలుకుం బొలాల మొలకల కలికీ!
జళికింపక, కనుగొన నను
బలుకవె పలికింపవె సుర భారతి సుదతీ! 49

అని ప్రతిమాలు నాథుని మహాకవితా మధుకోశ రూప వి
శ్వనయన చూచి, శాస్త్రికవి వైభవమెల్లఁదలంచి పిల్చిరీ
కినుకయు మంచిచేసెను స్వకీయమనస్థిత భావ వీచికా
ప్రణయ సుధానిధిన్ మిము నిబంధితు సేయఁగఁ గావె మస్త్రికా యత్! 50

ప్రభువుల్ స్రష్టలు జీవకోటికటులే వాణీ మనస్సాహితీ
సభకధ్యక్షులు, వేద వాఙ్మయ చతుష్కంఠా ముఖశ్రేణి, మీ
కభిమానింపగనేక పక్షమున భావ్యంబే! ప్రసూనాళి సౌ
రభసంపత్ప్రభ దిక్చతుష్కమునకుల్లాసమ్ము గల్గింపదే! 51

నిర్వికల్పసమాధిలో నిలుచుటనఁగ
శివుని మార్గము మీకును శ్రీపతికిని
పరఁగు సవికల్పము సమాధి పథము కాఁగ
నందుభావభారతి రూపమంది యుందు! 52

ఎందు భావ భారతి రూపనేఁజరింతు
నందు నిర్వికల్పమున మీరుందురేని
విరహ వేదన సైచుట తరమె నాకు
విందులక కాదె మమ్ము దైవమిందు నిలిపె। 53

అని విమర్శించి, నిజమనఃప్రణయ కాంతి
మొగము మొగమునఁ దమి చూపు ముసరుకొనఁగ
దాపు దాపున జేరి, విధాతృ తనువు
తులుకు బలుకుల ఁజిలుకునక్కలికి మిన్న। 54

చిఱు నవ్వుల్ గిలిగింత వెట్టఁగనులన్ జిల్కించి భావార్థముల్
నెఱవేర్పన్ విధివైభవమ్ములభివర్ణించెన్ బరిష్వంగముల్
ముఱియన్ దట్టుచు, బాహుబంధముల సంభాషించె. మోవిన్ వినన్
గఱపై పోయిన కూర్మిపల్కులను సంకర్షించి. వర్షించుచున్। 55

మధునాపంతుల జీవన
మధువులు చిందింపఁ బూను మధుజీవన కా
వ్యధునికినొకటవ పాయగ
విదిసాగె వరప్రసాద కృతిమతి సుడులన్।

# కథా సంగ్రహం

మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి జీవిత చరిత్రను చెప్పుమని భారతి చేతిలోని చిలుక ప్రార్థిస్తుంది. సరస్వతి అనుగ్రహించి, చెప్పనారంభిస్తుంది.— ఆకొండి రామమూర్తి శాస్త్రి దౌహిత్రుడు, లచ్చమాంబ, సత్యనారాయణ మూర్తుల పుత్రుడు, మహేంద్రవాడ సుబ్బరాయ శాస్త్రి, ఓలేటి వేంకట రామశాస్త్రి, చిలుకూరి వీరభద్రుడు మొ॥ పండిత పరికాండుల శిష్యుడు, భార్గవ సగోత్రుడు, శాస్త్రజ్ఞుడై కవియైన మనీషి, పల్లెపాల గ్రామ వాసి.

'ఆంధ్రి' అనే పత్రికను మూడేడులు నడిపి, అంతలో సూర్యరాయాంధ్ర నిఘంటు పండితునిగా ఉద్యోగియై పిఠాపురం నివాసం చేయసాగాడు. ఈమధ్యలో ఆకొండి రామమూర్తి శాస్త్రి కుమారుడు రాజగోపాలం కుమార్తె కామేశ్వరితో వివాహం జరిగింది, అప్పుడే 'ఆంధ్రి రచయితలు' అనే గ్రంథం వ్రాసి మాతా మహునికి అంకితమిచ్చాడు మహాకవి సత్యనారాయణశాస్త్రి.

నిఘంటు కార్యాలయంలో పనిచేస్తున్న కాలంలో 'రత్న పాంచాలిక' నాటకం వ్రాయగా పిఠాపురం మహారాజు దానిని అసూయతో దాచివేసాడు. బాధపడిన శాస్త్రి ఆఉద్యోగాన్నే విడిచి పెట్టి వచ్చేయగా 'రాజమహేంద్రవరం' లోని వీరేశలింగం ఉన్నత పాఠశాల అతనిని ఆంధ్రి పండితునిగా వరించింది

క్రమంగా ఇద్దరు ఆడుపిల్లలు, నలుగురు మగపిల్లలు జన్మించారు. సుబ్బలక్ష్మి, జయలక్ష్మి, వేంకటాచలపతి, రామమూర్తి, సత్యనారాయణ మూర్తి, సుబ్రహ్మణ్యశర్మ అని నామకరణం చేసారు దంపతులు. ఆడు పిల్లలు అత్తవారిండ్లకు పయనించారు. పెద్దకోడలు ఇంట అడుగుపెట్టింది రెండవ కుమారుడు రామమూర్తి మాత్రం వివాహం చేసికొనడానికి నిరాకరించి, బ్రహ్మచారిగానే తనను మిగల్చమని ప్రార్థించాడు.

కొంతకాలం నిశ్చింతగా గడచింది. ఆటుపై వాని జీవనంలో కరుణ ఝరి పైకిలేచింది. ఆ కథా భాగం చెప్పడం నావల్లకాదు మీ అయ్యగారినే (బ్రహ్మనే) అడుగమంటుంది శారద. చిఱుత రివ్వున విధాతఒడిలో వ్రాలి మిగిలిన కథ చెప్పమంటుంది. విరించి నవ్వి వాణితో "చెప్పేది నేనైనా నా పలుకువు నీవేగదా!" అని, ఐనా అడిగితివి గనుక చెపుతానంటాడు.



# ఉద్భవము

## ద్వితీయా శ్వాసము

ఒకనాడాదివచః ప్రపంచ బహూ సంయోజ్యార్థ సౌందర్య లో
కకథాది ప్రతిభాషణమ్ముల సముత్కంఠన్ సమీపస్థమౌ
శుక మొక్కండు నమస్క్రియాచరణ సంస్తూయాతాత్మఁ బ్రశ్నించె. ప్ర
ష్టైకృత శ్లాఘన వాక్ప్రసన్న హృదయశ్రీరాజితన్ భారతిన్। 1

రస పరిణామ సిద్ధ పద రంజిత భావ కథానువాదినీ!
విసువు దలంపకార్ద్రహృది వేడెద నీ పదమంటి పూర్వమీ
విసువునకెన్నియో కథలు నేర్పితివంతయు భావ ధారణా
పరిసరితమై ప్రవర్తిలఁ గృపన్ గవినాథునిఁ గూర్చి తెల్పవే। 2

అంచుఁ బ్రార్థించు శుకమును గనులఁ దడవి
మొలక చిఱునవ్వు నవ్వె. వాఙ్మూర్తి పలికె
లోక హితమైన కోర్కె కోరుటను నీకుఁ
జెప్పఁ గోరెదఁ బ్రేమించి చిత్తమందు। 3

నన్నపార్యుని ప్రసన్న కథా ప్రసంగమ్ము
లోఁ బ్రసంగించి పరిశోభమంద
తిక్కయజ్వ కవిత్వ దీప్త తత్త్వపు టీక
పరిశోధన మనమ్ము భద్ర పఱచి
ఎఱ్ఱనార్యుని సూక్తి కఱ్ఱాది సాధించి
పల్కఁ బల్కనవింత పథ్యమిచ్చి
శ్రీనాథ పదగుంఫనానందమును జుఱ్ఱి
కావ్యలక్ష్మికి మేన గగురు తెచ్చి

కృష్ణదేవరాయాస్థాన కీర్తి కాంత
సొబగులొకయింత కలయించి, గుబులు కొలిపి
చేతమున నిల్పి దాగుడు మూతలాడి
హాయిఁ గొల్పెను సత్య నారాయణుండు। 4

రాజ మహేంద్ర వరమ్మున
నా జీవితఁ దెనుఁగు పూత నవనీటి రుచుల్
యోజించిన వీధులనీ
రాజత్కవిరాజు పొల్పుఁ బ్రణత బుధుండై। 5

చతుర మహేంద్రవాడ కుల సాగర సంభవ సుబ్బరాయ శా
స్త్రి తరుణ కల్ప వృక్షము విధిం గరుణించిన శాస్త్ర సంపదల్
మతి విభవించుఁ గావ్యముల మాటున డాఁగి, చరించు ఁగోకిలా
యుత మధు మాస వైభవుఁడు యోజిత మౌని మనస్కుఁ డెంతయున్। 6

భావ వచః పరిసంగముల బంగరు పూతల సౌరభమ్ములన్
జీవము వోసి పాఠకుల చేతముల ల్లననాడఁ గన్నులన్
గావలి కాయఁ గైత పలుకం గలఁడాతఁడు సత్యభూమికా
సేవిత సజ్జనోన్నత రసీకృత చిత్త మహత్ప్రమాణుఁడై। 7

ప్రతిభనోలేటి వేంకట రామ శాస్త్రి
పలుకుఁ బ్రోత్సాహమొకయింత చిలుకరింప
మొనసి కైత కల్మలకింత మొగ్గ తొడుగు
చతురత మధునాపంతుల శాస్త్రికవికి। 8

గుణనిధి మధునాపంతుల కోవిదుండు
పూర్వ పుణ్యమ్ము పుట్టుక పుడమి కాఁగ
భావ కవితా విహాయస పథమునంటు
నక్షరాంభోధి గర్భమ్మునందు నిలిచి। 9

తొమ్మిది నెలలే రక్తానఁ దొరలి యుండె
నందునక్షర ప్రాణ మాహాత్మ్యమనువ
దించునాకొండి వంశాబ్ధి హిమ కరుండు
రామమూర్తి శాస్త్రి యను మాతామహుండు। 10

పాయని వేడ్క తోననుగుఁ బట్టిని ముద్దులు పెట్టి సత్యనా
రాయణమూర్తి పెంచెఁ దన యంశయగాఁ దన పేరు పెట్టి, శా
స్త్రీయిత బుద్ధియై వెలుఁగువంచును శాస్త్రినిఁ జేర్చి సత్యనా
రాయణ శాస్త్రి నామమున నాత్మజుఁ బిల్చి. రహించెఁ బ్రీతిమై। 11

అమ్మ యను మాట సార్థకమ్మై చెలంగ
నాత్మజుని సాకినది లచ్చమాంబ గరిత
యుగ్గుపాలలోఁ గవనంపు నిగ్గుఁ గలిపి
గోరు ముద్దలలోఁ దెల్గు సౌరు నిలిపి। 12

జన రుగ్మతఁ బోనాడును
జనకుఁడు వైద్యమ్ములో భిషగ్రత్నంబై
జన విశ్వేతన రుగ్మతఁ
గవి. పోరాడును సుతుండు కవి రత్నంబై। 13

భార్గవ గోత్ర పవిత్రిత
భర్గ ప్రతిభా ప్రభావ భావములెలయన్
స్వర్గ సతీ సౌందర్యా
నర్గళ కవితా పరిచోదనలఁ గావించెన్। 14

కుంభ లగ్నాన జననంబు కుంభ రవియు
మీన బుధుఁడును గేతువు మేషమందు
గురుఁడు కటకాన శని చంద్రులిరువురొకట
సింహమునఁ దులఁ గుజ రాహు బృంహణమ్ము। 15

మకర శుక్రుండుగా గ్రహ ప్రకరమలర
నిట్లు జన్మించె సుకవి మాహేశ్వరుండు
పలుక దైవజ్ఞులితని విద్వద్వరుండు
కవి వరేణ్యుండు బుధ యశస్కాముఁడనుచు। 16

వాని తొక్కు పల్కులఁ జిల్కుఁ బసిమిపంట
వాని చిఱు గజ్జియల కాలి వైభవమ్ము
భావి కవయిత యని చాటె, వానిఁ గన్న
పల్లెపాలెమ్మనకుఁ దోఁచె భాగ్యరేఖ। 17

# వి కా స ము.

సర్వజ్ఞ సింగరాజ కృతమ్ము రత్న పాం
చాలికకుఁ దెనుంగు పాలువోసి,
హర్ష రత్నావళి వర్షించి తెలుఁగుల
హృదయపుం బొలములఁ గుదురు పఱచి,
స్వప్న వాసవ దత్త సరళి తెనుఁగు స్వప్న
సీమకు మరలించి చేరదీసి,
సత్కౌముదీ కుహోత్సవ సాంద్ర చంద్రికన్
దెలుఁగుఁ బూఁతనొకింతఁ బులిమి చూపి
వఱలనుభయాభిసారికా వర రుచులను
వరరుచిన్ నింపెఁ దెనుఁగు భావమ్ము తొడిగి
భావిత వసుంధరా కావ్య పండితుండు
సత్య నారాయణుండు రస ప్రసూతి। 18

శాస్త్రము సల్కరించు నిముషమ్ము వయస్సునఁ జేరినంతనా
శాస్త్ర మనస్కుఁడైన పిత శ్రద్ధఁ దనర్చిన కర్మ సంస్కృతుల్
శాస్త్ర పథంబునన్ గఱప సత్కృతి సత్కృతిమత్ కృతింబలెన్
శాస్త్ర పథంబునన్ నిలిచె శాస్త్రి వరేణ్యుఁడు తత్క్రమంబునన్। 19

ఇంజరంబను ప్రాంతీయతం జరించుఁ
ఇల్లె పట్టున సంస్కృత పాఠశాల
కననెడారి మరుపప్రిప కరణినరసి,
సుబ్బరాయశాస్త్రి వరేణ్యుఁ జూచి, మ్రొక్కి। 20

తన వినయము తాంబూలము
తన గుణ గణములె విశేష ధన ధాన్యములన్
వినతులె వినుతులుగాఁ బ్రా
ర్థనఁజేసిననాకృపా నిధానము వానిన్। 21

సత్కరించి, ప్రేమ మధునాపంతులాన్వ
యాబ్ధి చంద్రుఁడునాఁ గీర్తినందునటులఁ
దీర్చి దిద్దెద బిడ్డ మదీయశక్తి
శారదా మనో భాష్య ధ్వజ ప్రసక్తి। 22

అనుచు 'మహేంద్రవాడ' హృదయాంబుజ జాత మరంద బిందువుల్
చివికి, ప్రకృష్ట దోహదము చేయుటఁ జేసి చిగిర్చిఁ, దత్కవీ
శుని మది, కల్పక ద్రుమము చొప్పున శాస్త్ర జలంబు ద్రావి, పూ
చినదొక కైత పూవు విరజిమ్ముచుఁదావులనెల్ల తావులన్। 23

సిద్ధార్థ వర్షాన క్షితిపైనిఁ బడియుంట
సిద్ధుఁడై శాస్త్రార్థ వృద్ధిఁ గొనియె
ఫాల్గుణంబున భూమి పాదమూనుటఁ జేసి
ఫల్గుణుండౌచు విద్వత్త్త గొనియె
పౌర్ణిమా దివస సంభవుఁడౌట దివిషద
న్న ప్రాశయమౌ కవనంబు కలిగె
మధు శబ్దమింటనే మసలుచుండుట చేసి
మార్దవమ్మునకు సౌహార్దమబ్బె

పలుకుఁ బలుకెల్లఁ గవితయై పరిఢవిల్లెఁ
జెప్పునది శాస్త్రమౌచుఁ దోచినది ప్రజకు
వ్రాయఁ బూనినదెల్లఁ గావ్యముగ మారె
ఆర్ష కవియయ్యె సత్య నారాయణుండు। 24

చిలుకూరి వీర భద్రుని
పలుకులలంకృతులు, వాని పాటవమునకున్
బులకితుఁడై కై తనుఁ దొడ
వులతో భూషించి, కవన పూర్ణుండాయెన్। 25

పల్లె పాలాన 'ఆంధ్రి' నాఁబరఁగునట్టి
పత్రికా రాజమును నడుపం గడంగె
కాళ్ళు చీకఁట్లు శ్రీమ్మ జగమ్మ నందు
విడిది చేసినదది యొక వేగుఁ జుక్క। 26

అది మూడేకుల బాటు సాఁగఁ గవితా వ్యాసంగ సంపత్తి లోఁ
గదలాడంగల సాహితీ ప్రియులు సంఖ్యావత్త్వకాండాశి పె
న్నిధియే దక్కినయట్టులై తనిసి,వాణీ దర్శన ప్రాప్తి గా
ద్గదిక వ్యాపృతినందినారు మధు భైక్ష్యంబంచు భావించుచున్। 27

## సాప్తపదీనము

అమ్మధు మూర్తికిన్ బ్రభవమందిన సత్కృతి కన్యకాళి లో
కమ్మున సుందరీ మణులుగా నుతికెక్కనతండు గూడఁ బ్రా
యమ్మునఁనుంటఁ దత్పితరులాతని (జీతి, వరాల తండ్రి)। పం
దొమ్మిది యేండ్లు వచ్చెవిఁకఁ దోఁచదు విన్నొక గేస్తు చేయమిన్। 28

బ్రహ్మచర్యాశ్రమమునందుఁ బలుకు వెలఁది
యెదఁద లోతులలో నివసించినాఁడ
విఁకఁ దృతీయాశ్రమమ్మె రుచించు మాకు
నాస్థనందుము నీవు గార్హస్థ్యమందు। 29

ఆకౌండ్యన్వయ రామమూర్తి తనయా హస్తాబ్జమున్ గొంటి. భా
షాకైవల్యుని నిన్నుఁ గంటివి, గృహస్థ ప్రాప్తి తత్పాత్రిచే
నీకుం గల్గిన, నిన్నుఁ బోలిన సుతానీకంబు నీకబ్బు, నీ
కై కామేశ్వరినిచ్చి, ధన్యుఁడగునయ్యా! రాజగోపాలమున్। 30

అని వాక్రుచ్చిననాలకించి, భవదీయాజ్ఞానుగామిత్వ వి
ద్యను లోఁగొన్న సుతుండ, మత్తను ధన ప్రాణాదికంబంకితం
బును మీకై పొనరించు భవ్య సవనమ్మున్ జేయఁగా సోమయా
జిని నేనై, తనివోయెదన్ గురుజనాశీర్వాదమామోదమై। 31

అని యుత్తరమిచ్చిన పు
త్రుని గని, సంతసము చెంది, తోడ్తో దైవ
జ్ఞుని రావించి, ముహూర్తం
బును దానేర్పఱచి, పెండ్లి ముచ్చట జరిపెన్। 32

భువి పీఠంబుగ నిల్చె, సంసృతి సుఖమ్ముల్ కష్టముల్ గూడ సం
భవమౌనయ్యెడలన్ క్షమా గుణ గణ వ్యాపారమేపార గౌ
రవమార్జించెడి సంస్కృతిన్ గొనుడి; ధర్మంబర్థమున్ గామమున్
రవణింపం గనుఁడీ చతుర్ధ పురుషార్థంబంచు వాక్రుచ్చుచున్! 33

చదలే పందిరి యౌచు విన్చెఁ బ్రణయోత్సాహమ్మునన్ వంశ సం
పద లోకమ్మున వ్యాపృతిన్ గాని, యశో భాగ్యమ్ము సర్వమ్ము స
ర్వదిగంతమ్ముల వ్యాప్తి నొందవలె, దైవత్వమ్ము సర్వమ్మునన్
గదియన్ జెల్లునటన్న ఋక్ప్రయము ఋక్థంబన్న సందేశమున్। 34

గళమంటన్ రవణంబులై సరములై కంఠోక్తిగాఁ బల్కెఁ జు
క్కల గుంపుల్ జని ధర్మ్య హర్మ్యములనౌత్కంఠ్యంబులన్ బొందినన్
గలుగున్ సిచ్ఛలు తారకా పథము నిక్కంబంచుఁ దేజస్వులై
వలపుల్ పండఁగఁ గాంచుఁడీ తనయలాభంబంచు దీవించుచున్। 35

ఉదయార్క ప్రతిమానమౌ ఘుసృణమున్ యోజించి ముత్తైదువుల్
నుదుటన్ దిద్దుచుఁ బల్కరొండొరులు మిన్నున్ మన్ను నేకంబుగాఁ
గదియన్ గోర్కుల రజ్జు చేసి, యనురాగ క్ష్మధరంబెత్తుచున్
మథియింపన్ బ్రణయాబ్ధి, దత్సుధలు సంపాద్యంబులౌనన్నదుల్। 36

ఇన తేజః పరిపూత మూర్తి సురలీక్షింపంగనుద్వాహ దీ
క్షను గైకొన్న వధూ వర ద్వితయ సౌఖ్యంబెంచి, యానాడు దీ
వెనలన్ బల్కెను సప్త జిహ్వుఁడు రసావిర్భూత సంపత్తి గై
కొనుఁడీ! సాక్షిని నేనటంచు మిగులన్ గూర్మిన్ బ్రపంచించుచున్। 37

పితలు సర్వులు మద్వంశ వృద్ధి కరులు
పూర్వమందునఁ బదితరంబులకునటులె
పరమునందునఁ బది తరంబులకుఁ గూడఁ
బ్రాతినిధ్యమ్ము వహియించు వారలెల్ల। 38

కారణాంతరముల చేతఁ గాలువింట
మసలఁజూఁడిన వారికా దొసఁగు తొలఁగి
శాశ్వతంబైన విష్ణు సంస్థానమంద
నేనునట్టులె జన్మ రాహిత్యమంద। 39

వినయ సౌశీల్య సాద్గుణ్య విశ్వ వినుత
కనక భూషణ భూషిత గాత్రి యైన
యనుఁగుఁ గూతురు కామేశ్వరివి గ్రహింపఁ
గూర్మి తోడుతనిత్తు నీ కొఱకు నేను। 40

అనునర్థంబిడు మంత్రి రాజములతోనారాజగోపాలమ
ల్లునకై విష్ణు పదోద్భవంబులగు నీటల్ ధారగాఁ బోసి, కూ
తును నర్పించెఁ బ్రతిగ్రహించుచు సముద్రున్ మామగాఁ గొన్న వె
న్నునిగాఁ దోఁచె వరుండు వేల్పు గమి కన్నుల్ వేలు లక్షింపఁగన్। 41

ప్రాచీ జాత దినేశ బింబ చయ తారా చంద్ర సాహస్ర స
ధ్ర్యీచీనంబగుఁ గాంతి పుంజములనుద్దీపించు మాంగల్య గౌ
రీచైత్యంబగు, బ్రహ్మమంత్రిత పవిత్రీభూత మాంగల్యమున్
రోచిష్ణుండు వధూ గళాన నిలిపెన్ రూపింప సౌభాగ్యముల్। 42

ముక్తా తండుల మల్లికా కుసుమ దీప్తుల్ వెల్లువల్ కాఁగ వి
ధ్యుక్తంబుల్ తలఁ బ్రాకి కీర్తివనితోద్యోగమ్ము మిన్నంటునా
సక్తిన్ మించి, గమించి తాముభయతస్సౌభాగ్య సంజీవినీ
శక్తిన్ గైకొనుఁడీ। యటంచు వినిచెన్ సందేశ సందోహముల్। 43

సాప్తపదీనమున్ జరిపె జంట మహర్షి జనోక్తమైన ధ
ర్మాప్తి గడించి, యర్థములనార్జన సేయుచుఁ గామితంబులన్
దృప్తిని నేర్చి మోక్ష పద దీక్షితునై సహధర్మచారిపై
యాప్తులు మెచ్చునట్లు నడయాడుమటంచు వరుండు పల్కఁగాన్। 44

మూడు తరములనుండియుఁ బుచ్చుకొనెడి
వారు మధునాపంతుల వంశ విభులు
వారినుండియునిచ్చి యానందమొందఁ
గలుగఁ జాలిరి యాకొండి కొలము వారు। 45

ఆంధ్ర రచయితృజీవనోద్యానమందు
విరగఁ బూచిన తుల్లియల్ సరులు సేసి
'ఆంధ్రరచయిత'లను పేర నమరఁ జేసి
తాతకిచ్చెను బైచేయి తనది కాఁగ। 46

క్షమకుఁ బృథ్వియు, గీము కర్జముల దాసి
భుక్తియందున మాత, రూపునకు లక్ష్మి
కరణముల మంత్రి, శయనాదికముల రంభ
సత్య నారాయణుని పత్ని షడ్గుణాఢ్య। 47

పతికన్న ముందు లేచును
బతి వెనుకన నిదురఁ జెందుఁ బతి మెచ్చఁగఁ దత్
పితరులు చొక్కఁగ సేవా
గతి సాగుచునాతిథేయ గౌరవమిచ్చున్। 48

భావావేశము గల్గఁగాఁ బతికి దివ్యచ్ఛక్తియై నిల్చు వి
ద్యావై దుష్యమునందఁగా నుడులలో స్పందించు నిష్యందముల్
జీవంబై ప్రతి కైతకున్ గృహిణి సంజీవింపఁగాఁ జేయు. జా
యావై దగ్ధ్యములిట్టులుండఁ గవితాభ్యాసమ్ము రాణింపదే। 49

మూడు వర్షాలు నిండిన ముద్దు బాల
'ఆంధ్రి' లాలింపఁ బడుచుండెనతని చేతఁ
బీఠికాపుర సంస్థాన విభుడొకండు
వాని వ్రత దార్ఢ్యమునకడ్డు వలికినాఁడు। 50

ఆంధ్రులు మోదమందగలరన్న తలంపును గల్గి, సూర్యరా
యాంధ్ర నిఘంటు లేఖనమునార్యులచే రచియింపఁ బూని. నీ
రంధ్రి కవిత్వ తత్త్వమున రాణకునెక్కిన వాఁడు, కార్య ని
స్తంద్రుఁడటంచు వేఁడు విని సర్వము భారము మోపె వానిపై। 51

పీఠికా పుర సంస్థాన విభవమెసఁగ
నాలుగేడులు గడిపె సత్కాలమచట
ఆగెనాంధ్రియ కోశమ్ము సాగుచుండె
స్వార్థమాగెను సాగెఁ బరార్థమపుడు। 52

హాలుని వంటి వేని విలయమ్మునఁ దాను రచించెఁ రత్న పాం
చాలిక నాటకమ్మును విశాల మనస్కృత కుంటు వడ్డ భూ
పాలుఁడు కొండెముల్ వినిన వాఁడయి దాని మఱుంగు వెట్టెఁ గా
కోలము గర్భమందుఁ గల కూళలకున్ సుధలిచ్చగించునే। 53

తల పీఠంబుగఁ జేసి నిల్పెదరు వంద్యంబంచుఁ గూర్మిల్ చెదన్
దల పీఠమ్ముగఁ జేసి నిల్చెదరు నింద్యంబంచు రాజాశ్రయం
బుల భోగంబులు శాశ్వతంబులని, మబ్బుల్ చూచి, పాత్రంబులన్
జలహీనంబులఁ జేసికొంటి వరివస్యల్ మాని నా యాంధ్రికిన్। 54

* ఆది మూదేడులు ముచ్చటై నడచిపోనల్లల్లనన్ సాహితీ
హృదయ స్పందన గుర్తులందుకొని యాంధ్రీ పత్రికా రత్నమ
భ్యుదయచ్ఛాయలకెక్కఁ గాలమునవయ్యో! పాపినై యాపికొ
న్న దరిద్రుండను, నిద్రలోఁ గలవరింతల్ నేటి నా యూహముల్। 55

అనుచున్ వందురి, తత్ప్రభుత్వమున సేవానక్తి యాత్మాభిమా
నిని నన్నుం దగులంగ రాదనుచు, వాఙ్నిర్దేజ నిష్యందమెం
దున రాసిక్యము గల్గు షట్పదికిఁ జేతో మోదమౌనా సర
స్సున సిల్తున్, లవణాబ్ధి నీరజములన్ శోభిల్లఁగాఁ జేయునే। 56

అని రాజ సేవ విడనా
డిన ఘను, వైశిష్ట్యమును గడించెఱుఁ దమినా
జ్జనమున్ నెఱపన్ దగవో
యని యున్నత పాఠశాల యాహ్వానించెన్। 57

అదియ రాజమహేంద్రియందందగించు
మహిత వీరేశలింగ నామమునఁ బరఁగుఁ
బాఠశాల, మహాత్ములవబలు నేల
సత్యనారాయణుండేలు స్వర్గ బాల 58

---

* ఆంధ్రిరచయితలు

ఆందాతని సత్కవితా
నందనమునఁ బూచెనెన్ని ననలో, తన్ని
ష్యందమ్ములు విందులుగాఁ
బొందిన రసిక ద్విరేఫములు నెన్నెన్నో। 59

## సంస్మృతి

అతని జీవితమునకపత్యముల పంట
ఆరు రుచులను బారవశ్యమ్ము నినిచెఁ
గన్న సంతానమాతని కనుల పంట
కావ్య కన్యకాళియు వేల్పు గముల వంట। 60

కీర్తి లక్ష్మియుఁ గావ్య లక్ష్మియుననంగ
కలిగిరాతనికిరువురంగనలు సుతలు
ధర్మమర్థమ్ము కామమోక్షమ్ములనఁగ
సుత చతుష్టయమా కవీశునకుఁ గలిగె। 61

కీర్తి దశ దిగంతాలలోఁ గ్రీడ సలుపు
కావ్య లక్ష్మియు సుజన లోకమ్ముఁ జుట్టు
ఇంతులేగిరి యత్తవారిండ్ల కొలుకు
నిలిచిరాసుతుల్ పురుషార్థములను బోలె। 62

సుబ్బలక్ష్మియు జయలక్ష్మి సొరిదినేగ
అష్ట లక్ష్ముల సౌశీల్యమచ్చు పడఁగ
నిలిచెఁ గోడలు వేంకటాచల పతియును
బ్రహ్మచర్యాశ్రమమునకు స్వస్తి పలుక। 63

తనయులందు ద్వితీయుఁడై తనరుఁ గాని
అద్వితీయుఁడు బ్రహ్మ విద్యా పథాన
రోసె సంసారమునకు సారూప్యమునకుఁ
దగిలెఁ జిత్తమ్ము పొగిలె బంధనములన్న। 64

అట్టి తనయుందు రామమూర్త్యాహ్వయుంతు
వింటివాఁడౌటకై ప్రయతించెఁ దండ్రి
దినకరుని కాంతి గుప్పిటఁ గొనుటయట్లు
తనయు ముంగిట విఫల యత్నంబులాయె। 65

పాయని వేడ్కతోడుత వివాహము సల్పెఁదు నాదు సత్యనా
రాయణ మూర్తి తమ్మునకు. బ్రహ్మ పదార్థమునందుఁ దక్క న
ల్పాయువులైన జన్మముల యందనురక్తి త్యజించి యుంటి నే
రోయుదునిట్టి బంధములు లోకము మెచ్చిన మెచ్చకుండినన్। 66

పిదపఁ దగును జివరి బిడ్డ సుబ్రహ్మణ్య
శర్మ గూడ దార సౌఖ్యమంద
నదియ సౌఖ్యమదియ యానందమద్దానిఁ
బడతునయ్య పట్టు విడువుమయ్య। 67

అనుచున్ గడ్డము చేతులం దదవుచున్ బ్రార్థింపఁగాఁ గాదు పొ
మ్మన నోరాడక బిడ్డ పల్కులకుఁ దానౌగాములన్ వీడె, బ్రి
హ్మను భావించెడి పట్టి పుట్టెనని బ్రహ్మానందమో! కాక, పెం
డ్లినిఁ గాదంట విచారమో! యపుడు తండ్రిన్ మూఁగఁ గావించుటన్। 68

కొంత కాలమ్ము గడచె విశ్రాంత తోడ
రసవదధ్యాయములకుఁ బారమ్ము లేక
కవివరేణ్యుని జీవన కావ్యమందుఁ
గరుణ ఝరి లేచినది తరంగముల గముల। 69

చెప్పఁగఁ జాల వాని జనిఁ జెందిన కాల విషాహి ఘాతముల్
చెప్పఁగఁ జాల జాలినెదఁ జీల్చెడి నవ్విధి వైపరీత్యముల్
తప్పని నీదు ప్రార్థనలఁ దత్పరతన్ గవి నాథుఁ గూర్చి నీ
కప్పనఁ బెట్టితిన్ గథనునావల తద్విధియే యెఱుంగుతన్। 70

అనునంతన్ శుక నేత్రిముల్ దడసె విద్యా దేవి నేత్రంబులన్
గన వచ్చెన్ విధి పాద పద్మములు సంకల్ప ప్రభావంబునన్
బ్రిణమిల్లెన్ శుకమంత సృష్టి విభవ గ్రైవేయ సౌందర్య భా
వనునంభోజ రజః ప్రసంగిత తనున్ వైరాగ్య భావోదయున్। 71

కోరితినక్కవీశ్వరునిఁ గూరిచి చెప్పఁగ జీవితాంశముల్
భారతి కొన్ని చెప్పె. విధి భావ విలాసములెంత కష్టముల్
నేరను జెప్పఁగా సుకవినేతృ వియోగ విషాద వేదనా
భారమటన్న. సృష్టివిభవ ప్రిభవా! కృపఁ గోరి వచ్చితిన్। 72

తండ్రి! నా యందు దయనుంచి, తత్కవీశు
జీవన విధానమునఁ దల్లి చెప్పఁ బోవి
భాగమును జెప్పి నా మనో భరము తీర్చి
యాదరింపుమా! నాతోడి యాంధ్ర జనుల। 73

అని విని నవ్వి, యవ్విధి రసాంబుధి కన్యక కంటి కోనలన్
గనలు జలంబు మీటుచు విగాహిత భావ విలోలనత్కనన్
దనుపుచుఁ బల్కె నివ్విధినిఁ దద్విధి తద్విధియే యెఱుంగునం
చనఁగునే సరస్వతి! యట్టైనను నా పలుకీవ గాదటే। 74

ఐనను నానలు మొగముల
పీనుల విందు భుజియింప వేడ్కయ యేనిన్
గానిమ్మటులే కవితా
ధీన మనస్కు కథ చెప్పి తృప్తిఁ బొనర్తున్। 75

మధునాపంతుల జీవన
మాధువులు చిందింపఁ బూను మధు జీవన కా
వ్య ధునిన్ రెండవ పాయగ
నిది సాగె వర ప్రసాద కృతిమతి సుడులన్।

## కథా సంగ్రహం

బ్రహ్మ చిలుకతో తరువాయి కథా భాగం చెప్పనారంభించాడు. శుకమా! మధునా పంతుల కవి నిజ జీవితంలో అనుభవించిన కొన్ని చేదు సంగతులు చెపుతున్నాను విను.

ఆమె కామేశ్వరి. సత్యనారాయణ శాస్త్రి ధర్మపత్ని. కర్మదేవతలు ఆమెను రోగాలతో రాపాడించారు. మానవ ప్రయత్నం ఫలించలేదు. కాలా విదే పైచేయి అయింది. ఋణము సరిపోయింది. ప్రారబ్ధమణగిపోయింది. ఆమె దేహత్యాగం చేసింది. ఆ సమయంలో శాస్త్రి విషాద గభీరుడై మౌనం వహించాడు.

స్వామి సచ్చిదానంద మహర్షి అదే సమయంలో వచ్చి సాంత్వన వాక్యాలు పలికి, జరుగవలసినది చూడమన్నాడు.

బిడ్డల రోదనలుమాత్రం ఆకసాన్ని తాకాయి. దేవతల చెవుల సోకాయి. అయినా వారి చిత్తములు కరుగలేదు. వీరి రోదనలు అరణ్య రోదనలుగానే మిగిలిపోయాయి.

మధునాపంతుల కవి కలం శంకరాద్వైత వాగ్వీధుల్లో విహరించ నారంభించింది. రెండవ కుమారుడు రామమూర్తి పూర్తిగా తాత్త్విక ధోరణిలో పడ్డాడు. రోగములు శరీరంలోకి ప్రవేశిస్తుంటే ప్రకృతి వైద్యం తో నివారించుకొనడానికి తనప్రయత్నం తాను చేస్తూవచ్చాడు. అన్నమయ ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాలు జయించి, ఆనందమయ కోశానుభవాన్ని గడించాడు

గత జన్మలో ఆతడు శ్రీరామ కృష్ణ పరమ హంస శిష్యుడు. కొంత ప్రారబ్ధం మిగిలి మరల జన్మించాడు. అయితే పూర్వజన్మ స్మరణం మాత్రం పోలేదు.

ఒకరోజు రాత్రి తండ్రిని తన గదిలోనికి పిలిచి ఎన్నడూ లేనిది చాల పొద్దుపోవు వరకు ఏమేమో ప్రసంగాలు చేసి నిద్రించినవాడు మళ్ళీ కన్ను తెరువలేదు.

పిలిచినట్లుగా మళ్ళీ అదేసమయంలో స్వామి సచ్చిదానంద మహర్షి వచ్చి ఓదార్చి. అనంతర కార్యక్రమాలను నిర్వర్తింపజేసాడు. అంటూ బ్రహ్మ కథాభాగం వివరిస్తూండగా వేడి బాష్పాలు విడుచుచున్న భారతిని చూచి. అక్కునకు గ్రుచ్చి. ఈపై ఆకవికి అంతయూ శుభమే అగునని అభయమిచ్చి సాంత్వన పరిచాడు.

మూడవ కుమారుడైన సత్యనారాయణమూర్తిని గృహస్థునిజేసాడు పూర్ణాయువు కలిగి నాల్గవకుమారుడైన సుబ్రహ్మణ్యశర్మను గూడ గృహస్థుని చేస్తాడు శీఘ్రముగా మహాకవి 'మధురానంతుల' అని ఆశీర్వదించగానే భారతి కంటనున్న దుఃఖ బాష్పాలు ఆనంద బాష్పాలుగా మారాయి. అది చూసిన బ్రహ్మగూడ ఆనందించాడు. ఆ ఇద్దరి ఆనందాన్ని గాంచిన చిలుక సంతుష్టయై ఆకవి కవితా వైభవాన్ని తెలియజెప్పమని అర్థించింది భారతిని.

నేనే వాక్స్వరూపను గనుక నేజెప్పుట పాడిగాదు. నా ఆజ్ఞగా సత్యలోకంలో ఒక సాహితీ సభను ఏర్పరచమంది శారద. రెక్కలు టెపటెపలాడాయి చిలుకకు.

---

# 'కాలం' - 'కన్నెఱ్ఱి'

## తృతీయాశ్వాసము

భారతీ సతీ శిక్షణోద్భవ వినూత్న
శబ్ద సౌందర్య కాంచన సాధ్యవికష
శుక! విను మధునాపంతుల సూరివర్య
జీవితానుభావ్యమ్మగుఁ జేదు విజము। 1

ఆమె కామేశ్వరీ నామ యజ్ఞమూర్తి
సత్యనారాయణుని ధర్మశాస్త్ర రచన
వల్లభ మధునాపంతులాన్వయ పవిత్ర.
క్ష్మాహృదయ. వేదగమ్య. ప్రశాంత చిత్త। 2

కవితా లాలన లోల లీలలను పాళికారించుఁ దజ్జీవన
చ్ఛవులన్ జూచుచుఁ గర్మదేవతలు రోష క్రాంతి దేహేంద్రియ
వ్యవసాయంబునఁ జీఁకటిన్ జొనుపఁగా యత్నించి దీక్షామతిన్
భవ లక్ష్మిన్ సతిసంత రోగముల రాపాదించి రీర్ష్యాగతిన్। 3

ఋణము సరిపోయెఁ బ్రారబ్ధమణఁగి పోయెఁ
గాము నీశ్వరత్వమ్మునంగత ధరించెఁ
గవితలంబు పర్వృత్తి మార్గమును నెమకెఁ
బలుతు చేదియ వేడి బాష్పములు రాల్చె। 4

అగ్ని హోత్రపుటధికారమాగళించె
నగ్ని హోత్రపు టధికారమా — గళించె
తనకు దనకుఁ దద్వైద మింతయు తలంపఁ
దనకు బ్రతుకెల్ల నొంటరితనము మిగిలె।   5

చిఱునవ్వు నెదిరింత చిందించుచున వచ్చు
ముఖమందునే నవ్వు మొలకలేదు
ఎప్పటి కేవి యెట్లేర్పడఁ దగునట్లు
కరుణించుఁ గరములు కదలబోవు
ప్రత్యంగుళము వింటఁబనిసేయ గమియించుఁ
బదములు విసుమైన గదలలేవు
ధర్మ భావనఁజేసి తాత్పర్యమున మన్గుఁ
దనువింక క్షణమైనఁ దడయఁబోదు
ఎన్ని నాఁడుల పుణ్యమో! యీశుభాంగి
యెన్ని నాఁడుల పాపమో! యీ వియోగ
కాల వహ్నిచ్ఛటాటోపగరళసేవ
తన్నుఁదన లోననఁ గలువు కొన్నయంత।   6

పలుకదు బుదుతలనరయఁడు
పలికినను బలుకు పెదవుల పయినతుకదు మి
త్రులు పలుకఁగఁ గదిసినఁ దను
బలుకఁగఁ గనులఁ గొలను గనుఁ బదపడి కనుచున్।   7

కాలమనివార్యమని చెప్పి క్రమముఁ దెలుప
నరుఁగుఁదెంచెనో కాక మహాత్ముఁడపుడు
స్వామి సచ్చిదానందేంద్ర శాంతతనువు
సంజనెదురైన వాహిని సరణి నచట। 8

ఏవియో వేదనలుఁ గొన్ని యావులించి
యావరించినవా గృహ స్థావరమున
గవిముని గిరులఁ గదిలింపఁ గలిగెనంత
గుండె సవ్వడి కంటి వాగులజలమ్ము। 9

మూసిన కన్ను ఱెప్పలరఁబూచిన జీవిత కావ్యమంతయున్
మూసిన యట్టులయ్యె నను మోసిన నీనవ మాసవేదనా
న్యాసము నందు నొక్క క్షణమైనను నిన్ను యజింపలేదు న
న్గాసిలఁ జేసెదేల? ఁబలుకందగదే? నిజరక్త సంభవున్। 10

కడిపెడు కండలన్ దనువు కల్పన వేసిన తల్లి! కన్నులం
దడిపెడు భాగ్యమింక ననృతంబయి పోయె సదా కృపామయం
బుడుగర వేసి బిడ్డల మహోత్సవముందిలకించుఁ బుణ్యమిం
కుడిగెనె! మాకనుత్ గనె నొకో విపదంబుధి భంగ సంగతిన్। 11

అమ్మా! కన్గవవిప్పవే! పలుకవేమమ్మా! తనూజున్ మనం
బెమ్మెల్ వంచెడి. గుండెపిండెడిని మమ్మేలా భువిన్ వీడితే
లమ్మా! కానవు కన్నులన్ బలుకవమ్మా! చూడవమ్మా! చనన్
మమ్మున్ దోఁకొని పోతపోయితివిదే మాత్రంబు న్యాయంబటే। 12

ప్రాణములు లేని తనువుల పగిది నిలిచె
వేఱు పడి పోయి పడుఁ దీప తీరు వగచె
నీవు లేనట్టి మా హీన జీవనమ్ము
కాంతి మడసిన కృష్ణ పక్షమ్ము రాత్రి। 13

కనులఁ జూడవె నన్నుఁ గనులఁ జూడకయున్నఁ
గనులేల మాకింకఁ గాలి పోను
కరములం గొనుమమ్మ కరములం గొనకున్న
కరములు మాకేలఁ గాలిపోను
పలుకరింపుము మమ్మ, పలుకరింపఁకయున్న
నాలుక మాకేలఁ గాలి పోను
కదలి రమ్మికఁ గావఁ గదలి రాకున్నచో
కాళ్ళేల మాకింకఁ గాలిపోను
నీవు లేని మా జన్మంబు నేలఁ గలియఁ
గలియదేలా! నిముషమైన నిలువలేము
తల్లి! మేమును నీతోడఁ దరలి రాఁగఁ
గరుణఁ జూడవె యెద మమ్ముఁ గన్న తల్లి। 14

మా యాయువంతయుఁ బోయనుంటిమి తల్లి
కరయుఁడో! దేవతలార! మీరు
మా పుణ్యమంతయు దాపించుకొని యాయుఁ
దమ్మనో దేవతలార! మీరు
నర మేధమున మమ్ము దరియించి దయసేయుఁ
డా! తల్లి దేవతలార! మీరు
తల్లి కంటెను దైవతము లేమి నెఱుఁగని
వారలా! దేవతలార! మీరు

యజ్ఞమున మీకు హవిరాజ్య యాజనములఁ
దృప్తిఁ గలిగింతుమాత్మ సందీప్త శక్తి
శక్తి సంపన్నులార! కృశానులార!
భక్త వత్సలులార! శుభమ్మువిందు! 15

కదలునా? కనులింకఁ గదలిన నా కండ్లు
కాన్కలిత్తును సూర్య! కరుణఁగనుమ!
పలుకునా? నా తల్లి పలికిన నా జిహ్వ
కాన్కనిత్తును వహ్ని! కరుణఁ గనుమ!
కలిమి గల్గిన మేనఁ గలిగినఁ గల కల్మి
కాన్కలిత్తు ననిల! కరుణఁ గనుమ!
పంకించునా మౌళిఁ బంకింప నా మౌళి
కాన్కలిత్తు వరుణ! కరుణఁగనుమ!
ప్రాణమయమైన శక్తి విద్యాధిరాజ్ఞి
బొటు బొటుగ రక్త విభూషలిత్తు
నా జనని మేన రక్తంబు నడుపుమమ్మ
యవయవంబులఁ జైతన్యమంటువటుల. 1[illegible]

పుడమి తల్లీ! మ్రింగఁ బోకుము తల్లిని
నర్పింతు నాదు దేహమ్ము నీకు
ననలుఁడా! నా తల్లినారగింపకుమయ్య
యర్పింతు నన్ను హవ్యముగ నీకు
ననిలుఁడా! దయసేసి, జననియందునఁ జేరి
శ్వాసనిమ్మా నన్ను వదలి పోయి
గగనమా! నా తల్లి కంఠమ్మునొకమాఱు
మ్రోగింపుమా! నన్ను మూఁగఁ జేసి

వరుణుఁడా! తన్ను నీపైన గరుణఁ గనుమ
పాంచ భౌతికమైన ప్రపంచమందు
స్వయము మూల ప్రకృతులైన శక్తులార!
యమ్మనొసఁగుడీ! పంచ భూతమ్ములార! 17

అనుచు బిడ్డలు సేయు రోదనములుప్ప
రమ్మునందున జేజేల శ్రవములంటెఁ
గాని వారికి చిత్తముల్ కరుఁగకుంట
తనయ వేదనల్ గహన రోదనములయ్యె 18

గద్గద స్వర వేదనా గళ వినాద
శబ్దముల పొంగు వెల్లువ జాలు వార
శాంతి సూర్యుని కిరణాల భ్రాంతి గొలిపి
కవి ముని కనులఁ దడిఁ బెట్టెఁ గలఁత పెట్టె। 19

స్వామి యాజ్ఞననుసరించి, జరుఁగ వలయుఁ
గార్యమును గాలమే దిద్ది, ధైర్యపఱచె
కష్ట సుఖముల తనకంటకయ భ్రమించుఁ
గాల చక్రమ్ము తిరిఁగె వేగమ్ము కొలఁది। 20

సత్కవి మధునాపంతుల శాస్త్రి కలము
వెదకె శంకరాద్వైత వాగ్వీధులందు
శాంతి సుమము పుష్పించు వృక్షమ్ము కొఱకు
భావ నయనమ్ములనిమిష ప్రతిభనందు। 21

బ్రిహ్మ సూత్రాల స్వభావంబు లక్షించి
జీవన సూత్రాలఁ జేసికొనుచు
నుపనిషత్సిద్ధాంతముపనయించెడి పల్కు
నెడెఁద సిద్ధాంతీకరించుకొనుచు
ఋషి పుంగవుల తపః కృషి సస్య ఫలముల
లోన గాదెలు కట్టి లోను గొనుచు
జ్ఞాన వైరాగ్యముల్ కలయించుఁ గలిమికి
బలిమినిఁ గలిగింపఁ జలముఁ గొనుచుఁ
చిత్త విశ్రాంతి సాధనా సేవనమున
జప తపంబులు కవితా ప్రసంగ రచన
భావనా పవిత్రత లోనఁ బరిఢవింప
నిముషములఁ గడపెను వర్ష సమములటుల। 22

రెండవ పుత్రుఁడెంతయునెఱింగియుఁ గాసిలె రామ మూర్తి. బ్ర
హ్మాండమునందునున్న క్రమమంతయు లోన విమర్శ సేసి, పిం
డాండము పద్ధతుల్ దడవి, యాత్మ మనంబున నిల్పుచున్ దపః
పండితుఁడై చరించె భవ బంధము చందము కందు వాఱఁగన్। 23

ప్రహతము మాతృ బంధమనుభావ్యము కాఁగ వియోగ వేదనన్
సహనము కల్గె, దుఃఖమును సౌఖ్యము భేదము తోపఁ బోదు, స
న్నిహిత విశిష్ట శాస్త్ర గణనీయ విశేష గవేషణంబులన్
సహచరుఁడౌచుఁ దాత్త్విక విచార పథ ప్రతిభా విభాసియై। 24

ధ్యాన ధారణ విల్చి తత్పరుండయి పొల్చి.
యన్నమయముఁ జొచ్చి యవలికరిగి,
ప్రాణముల యమించి, భస్త్రికాదులఁ గూర్చి
ప్రాణమయము జొచ్చి యవలకరిగి,
కవి, మనోమయము సాక్షాత్కార భాగ్యంబు
నమస్కృత యజించి, యవలకరిగి,
విజ్ఞానమయమందు విదితాత్మ సర్వత్ర
నవలోకనము సేసి, యవలకరిగి
అరసి యానందమయ కోశమసుఖవంబు
దానిలోననున్న హృదయ దహరమరసి
యాత్మనందు దర్శించె, మహాత్ముఁడగుచు
రామ మూర్తి తానాత్మాభి రామ మూర్తి। 25

ఒడలనొకింత రోగోపలక్షణమున్న
ప్రకృతి వైద్యమె కాని పరము గనఁడు
తనకుఁ దా విజ్ఞాన ఖనియైన నేరివి
వాదింపఁ బోరాఁడు వాస్తవముల
శాంత స్వభావంబు, సంతరించిన రీతి
భూతి వింపు శ్రుతుల బుద్ధిఁ జొనిపి
సుఖ శక్తి ధన వృత్తిఁ జొక్కఁ బోవఁడు పితృ
నానతికొకయింత యవలఁ బోడు
ఎన్ని జన్మల పుణ్యమో యీ వినుంగు
కవి వరు మధునాపంతుల కన్న కడుపు
చీరు మాతృ వియోగమ్ముఁ దేరుకొనుచు
నీ ప్రపంచ సౌఖ్యంబులనీసడి.చె॥ 26

పూర్వపు జన్మ భావమును బొందఁగ సద్గురు రామకృష్ణునే
పూర్వపు రీతి సద్గురుని భూమిక దిద్దుచు. దిద్దుచుం దపః
పర్వమునాత్మ జ్ఞాన మయ భావములందు మునందుచున్
ఖర్వ వచః ప్రసంగ గుణ భావ చమత్కృతి శాస్త్ర వాసనల్। 27

క్రమము క్రమముగ చంద్రికిఁ గాన్క వెట్టె
రామ కృష్ణ పరమ హంస రచనలందు
వెలుఁగు వెల్లులనేరి సేవించి చూపి
వేద వాక్య సమన్వయ స్వేచ్ఛ తోడ। 28

మధ్యాక్కర
ఒక రాత్రి గదిలోన వెలుఁగులూర్మలన్ గబురంపఁ గనుల
సుకవి చంద్రుఁడు లోఁ దలంచి చూడఁ బుత్రుని జాడనపుడు
ప్రకరణ మీమాంసఁ బలుకు క్రమముతో వెలయించి బ్రహ్మ
నికటమునకు బుత్రుఁడున్న నియతి భావమునందు నిలిపి। 29

ప్రొద్దు పోయెను నిద్దుర పొమ్మ తండ్రి।
కాల పురుషుని భావనా క్రకచ శక్తి
తనువు తట్టు కొనుట యున్నఁ దరము కాదు
మునుల కైనను సత్త్వపో ధనులకైన। 30

అనిన పిత ఱెప్ప వాల్పక కనియె సుతుఁడు
గురుని యాపాద మస్తకమరసి యరసి
కాలఁది శ్రమఁ జేసి గురునడుగులను బడియెఁ
ప్రజకునిది యొక్కటే యాత్మ రక్ష యనుచు। 31

పదములను బడిన సుతుఁ గని
చెదరిన మనము నొక యింత చేర్చుచుఁ బలికెన్
బద లలితుండు గవీశుఁడు
పద! లలితమయిన నడకయ పండించు వినున్‌। 32

సుతుఁడు లేచి యార్ద్రి హృదయమతుకులిడుచుఁ
"తండ్రి! యీయాసనము పవిత్రము నొనర్చి
శ్రోత్రి సార్థకంబుగఁ బల్కుచుం దరింపఁ
జేయవే" యని, భూమినీక్షింపుచుండ। 33

నాటి వావి పల్కు భరమ్ము నాటుకొనిన
హృదయమొక యింత గడబిడ నీల్గుచుండఁ
గళవళంపడి, చెంపలఁ గంటి నీరు
దాచుకొని యుత్తరీయానఁ దండ్రి వలికె। 34

బాబూ! యుపవిష్టుఁడవై
నీబాగుఁ దలంచి, వేద నియత పథమ్మున్
సాబాలార్యుల పల్కుల
సాబాలుగ వినుతు శ్రోత్ర సార్థక భణితిన్‌। 35

అనుచుఁ జెప్పఁ బోయెదునంతనతఁడు దివిరి
పల్కఁ బోయెను, దండ్రియుఁ బలుకనాపె
నేదియో చెప్ప దొరకొనెనిది యటంచు
నెవ్వరికి జాలునూహింపనీశ్వరేచ్ఛ। 36

అరసి రామ కృష్ణ పరమ హంస పదము
సేవఁ జేసితి పూర్వ నిశీధియందుఁ
బూర్వ జన్మ స్మృతుల్ నాకు బుద్ధి నిలువ
విద్య కలిగెను, సంస్కృతిన్ వెలుపు కలిగె। 37

శ్రీరామ కృష్ణ గురునకు
మీలని శిష్యుఁడనయి, పరిమిత సాధనలన్
నేరిచి, లక్ష్యము బ్రహ్మము
గారమియించుచు గురు కృప కలుగన్ గలుగన్। 38

కుండలినీ శాస్త్ర క్రమ
పండితుఁడను నన్నును భవ బంధితుఁ జేయన్
దండించిన మీ తలఁపును
ఖండించితి నన్ క్షమింపు కన్న నిసుంగున్। 39

సాధనయ మన్కి, మన్కియే సాధనముగఁ
దపము పండించి, యాత్మ సాధన ఫలించి
కనిన ప్రారబ్ధమది కొంత యనుభవింప
ఋణము దీర్పంగ వచ్చి సుకృతి ఫలింప। 40

పుంస్త్వ శారదా మూర్తి! మీ బొజ్జయందుఁ
బండు భాగ్యమ్ము కలిగినఁ బండు వగుచుఁ
గడచెనిన్నాళ్ళు, సుఖము పుష్కలము కాఁగ
భావ భారతీ! సేసెద వందనములు। 41

గురులు, గాయత్రీను గ్రిహ పరులు, మీరు
దోయిలించిన మీ కర తోయజముల
ననువదించుచు వాత్సల్యమాత్మ శక్తిఁ
దనువు స్పృశియింపుడా! భావ ధారణమున, 42

అనుచుఁ బలికిన సుతు పల్కులాలకించి,
పలుకఁ బెదవులు కదలని పండితుండు
సగము తెఱచిన కన్నుల సందడింప
స్పర్శ చేసెను వత్సల స్పంద బుద్ధి। 43

సవిత చుట్టును భ్రమియించు క్ష్మనుబోలి
సుకవి దోయిలి చకరిత సుతునిఁ దడపె
నెదలు రెంటనుఁ బొంగుచు నేకమయ్యె
ఋణషటను బంధ మచటి ప్రక్రియ దలంప। 44

నిద్దుర వేళ మించె జని నేడు ఫలించెను సాకు మీ కనుల్
దిద్దుత నాత్మ రూపమును, దేలుత నిద్దురవిం(ద్రియమ్ములన్
దిద్దుతనింద్రియాధిపులు దేవత లెంతయుఁ జిత్త శుద్ధి మి
మ్మద్దుత, వేద ధర్మ్యమున నంజలి నించెద లోవికేగుడా। 45

అనిన సుతు మారు పల్కుటకలనుఁడగుచు
పెదలుటకుఁ గాళ్ళు రాక రావించుకొనుచుఁ
గాలమును జూచి సరియనెఁ గవి వరుండు
కదలి పోయెను విశ్రాంతి సదనమునకు। 46

తననుఁ బల్కించి, పలికిన తరుణమెపుడు
తలఁపునకు రాకఁ సుతు వర్తి తత్తరింప
యోజనల దుప్పటినిఁ గప్పి యుల్లమునకుఁ
బవ్వళించెను. మన సత్య పండితుండు। 47

ప్రారబ్ధ్యాంత్యమునందు శ
రీరంబు విముక్తమయిన రీతిని, సర్వా
ధార తమో ముక్త యగుటఁ
గారవములు పిక్కటిల్లఁ గాకములతెలిచెన్। 48

కాకా శబ్దంబులు చెవి
బాకా పట్టినటులెసఁగఁ బండితుఁడంతన్
లోకేశుఁ దలచె, నయన
ప్రాకారములన్ దెఱచెను గ్రమమగు నుతులన్। 49

జ్యోతిర్విదులను నిజ కృప
జ్యోతిష్మంతులను జేయుఁ జూడ్కులఁ దోచెన్
జ్యోతిశ్చక్రమున మహా
జ్యోతి యగుచుఁ గర్మ సాక్షి యుదయాద్రి పయిన్। 50

బ్రహ్మ ముహూర్తానఁ బ్రాభాతిక స్తుతుల్
వినిపించునది నేడు వినఁగ రాదు
బాల భానుని కాంతి నీలి సీసా నీటు
నెలయించునది నేడు నెదుట లేదు

స్నాన వస్త్రము మావి శాఖ వ్రేలుచునుంతు
నది నేడు కనులందునతుక లేదు
అగరు వత్తుల ధూపమలరించు గృహ వేది
నీవేళ సదియైననెగయ లేదు
కారణంబేమి? బాలు శరీరమందు
నలఁత గలిగెనో? కలిగెనో? కలఁత సుంత
యనుచుననుమానమున లోనవడుగు లిడియెఁ
గలఁగుచు మధునాపంతుల కవి వరుండు। 51

ఱెప్పలు వాలి యుండె, ముఖ రీతి సుషుప్తి ధరించి నట్టులే
చెప్పక చెప్పుచుండెఁ బరిశీలన సేయఁ బదమ్ములంగుళుల్
చొప్పుల నిల్వకుంట,ఁ దను సోకెడి. వేచెడి దోమలన్ క్షణం
బప్పుడు సంచలించెడి ప్రయత్నము లేకయె యుండుటారయన్। 52

పవడగీతి
ఎగసె నిట్టూర్పొకంతు
మిగిలెఁ బాదముల్ కదల
బొగిలెఁ గనుల మనంబు
మొగమున వెలుంగు క్రుంగె। 53

వడఁకుఁ గాలి నడక వడఁకింపఁ గతములు
వెడలి, కొమరుఁ జేయి విధి గణించె,
తడసి, పలుకు నాడి తపియింపఁ దన యష్టి
సడి వినంగఁ జెవి ప్రశాంత పఱచె। 54

పలుకని నాడి వాని పలు పల్కులనొల్కు మహత్తఁ బల్కఁగా
పలుకుల నాయకుం బలుకుఁ బంతమునన్ బలుకంగ లేనటుల్
గలఁచె, కలంచె, నాడులు వికావికలై తనుయష్టి ధారణన్
నిలువఁగలేనిదయ్యెఁ గని నేతకరంబు కరంబు వేదనన్। 55

మేలవగీతి

చేయి వదలి కవి కరములు చెదరినటుల వ్రాలెఁ
బ్రాయికముగఁ గనుల నిలచెఁ బాసి యెదఁదఁ బట్టి
దోయిలించెఁ గాల గతికి దుడుకు నలువ విధికి
న్యాయమింతమాత్రి కలిఁ బ్రియాస జీవనముల। 56

క్షణము క్షణమును నీసేవఁ గ్రమ్మకొనిన
జీవితమ్మన క్షణమైనఁ జిక్కఁబట్టు
సంఘటన విల్వఁ జాలవు శారదాంబ।
యేమి పాపమ్ము చేసితి ఏంత చేటు। 57

రామకృష్ణుని సూక్తి ప్రసరించు జిహ్వపై
నిలువఁ జాలదు గదా। పలుకుఁ బడతి
ఘన వివేకానందుఁ గలయించుఁ జిత్తమ్ము
తలఁపనోపదు గదా! పలుకుఁ బడతి
బహు భాషలను లోనఁ బండించు లేఁగుబ్బ
విలువలెంచదు గదా। పలుకుఁ బడతి
సుఖమింతయును గోరఁ జూడని, పసివాని
నిలువనోపదు గదా। పలుకుఁ బడతి

పెదవి కదలని పలుకు లివ్విధి మనమ్మ
పొగిలి పెగిలి, రగులు మనోబుద్ధులెగసి
కనులఁ గనల వణంకుచుఁ గవియెఁ గదిసె
మిగులు సంతానమాత్మ స్త్రభించె యపుడు। 58

ద్విపద

సచ్చిదానందేంద్ర సారస్వతుండు
వచ్చె దై వేచ్ఛచే, వగచునాతనివి
పలికించె యోదార్చి భావ ధారతిని
కలి కాల మహిమమ్మ కర్మ మార్గమ్మ
బ్రహ్మ సూత్రములందుపనిషత్తులందు
బ్రహ్మ సత్యమునందు రమియించుచుండి
నశ్వర రూపాది నాశంబు చూచి
విశ్వ సహజమైన విధమందుఁ దెలిసి
వగవనేటికి బిడ్డ। వలదు దుఃఖమ్మ
మిగులు సంతానమ్మ మృదుల చిత్తముల
నుత్తలంపడునేమొ। యూహింపుమయ్య
చిత్తాన ధృతివింత చేపట్టు బిడ్డ। 59

అని యనేక సాంత్వన వాక్య యుజ్ఞ విధుల
నతవినోదార్చి యతి వరుండప్పుడచట
మిగులుఁ గార్యంబు తన మాట మెలఁగఁ జేసె
వారి నందఱఁ గ్రిమమునవారితముగ। 60

పలుకుచునిట్లు భారతి స్వభావము మోమునఁ జూచి, కన్నులం
దొలికిన నీరు నెమ్మదిని నమ్మలికంబు సృజింపఁ గాటుకన్
గలసి, యెదందఁ బొంగుచుఁ బ్రకంపిత భావ తరంగ సంగతిన్
విలులితమౌటనారసి, తపించెఁ జతుర్ముఖుఁడంత భావనన్। 61

అక్కనకు గుర్తిచ్చి, పైపంచెఁ జెక్కులొత్తి
సంతసము కావి, దుఃఖమావంతయేని
నీవు గానిది నోరాడునే వచింపు
మేల బేలవై దుఃఖింతువింతి యింత। (2

అనుచు లాలించు విధి వశమున ముఖంబు
దాచుకొంచు వచించె శబ్ద ప్రధాన
విధి విలాసము, లాలన విధి విలాప
విధియుఁ దెలియంగఁ బోలదెవ్విధిఁ గరమ్ము। 63

కరము కరమునఁ గలుచుచుఁ గరము కూర్మి
నలువ రెట్టింపఁ బలికెను బలుకుఁ బడఁతి
కవివరు మధునాపంతులఁ గతుణఁ గని ము
లేక సహియింపఁ జాలఁ జాలింపుఁ బలుక! 64

మధు వాక్య ప్రతిబింబ చుంబి వచనోన్మాద-బు భాష్యీకరిం
చి, ధవుడంత వచించెనో పకియు! నీచిత్తానుసారమ్ముగా
మధునాపంతుల వంశ దీపకుని, ప్రేమన్ సత్య నారాయణున్
వ్యధ యేమాత్రమునొందకుండునటు బ్రహ్మానందమున్ గూర్చెదన్। 65

శ్రేయము గల్గునాతనికిఁ జేసిన బాసలు రిత్త పోవు; వి
ద్యాయుతుఁడౌచుఁ దండ్రికి ముదమ్మిడు మూడవ పట్టి సత్యనా
రాయణ మూర్తి గూడనొక యన్నల మిన్నను బెండ్లియాడెఁ బూ
ర్ణాయువు గల్గి శర్మను గృహస్థునిఁ జేయును గాత! శీఘ్రమే। 66

కామేశ్వరి భ్రమరాంబిక
మామను దమ కన్న తండ్రి మాదిరి చూడం
గా మధునాపంతుల కవి
యాముదితల దుహితలట్టు లభిమానించున్। 67

భావి నింద్రియాధిష్ఠాన దేవతలను
వావినలరించెదరు గాత, వాస్తవముల
క్రోధ కామ వికారముల్ కుంటు వడుత
యతని చిత్తమ్ము నైర్మల్యమగునటంచు। 68

దాన సంతుష్టయైన శబ్ద స్వరూప
నాపె యానందమునఁ దృప్తినందు నలువ
నరసి శుకము ప్రార్థించె విద్యా సమృద్ధిఁ
గవి వరు కవితా రూపమ్ముఁ గనికరింప। 69

వాక్స్వరూపనగుట సర్వ వాఙ్మయంబు
నందముగఁ దోచు భావనా స్పంద నియతిఁ
జెప్పఁ జాలము గాని శిక్షింప నిన్ను
శారదాజ్ఞను బ్రికటింపు సత్య సభను। 70

అను సరస్వతీ వాక్యమ్ము ననువదింప
విధి ముఖంబులఁ గనుల భావించి శుకము
దంపతుల పాదముల మ్రోల దండమొసఁగె
తెప-తెపలనాడెఁ బక్షికి తెక్కలపుడు। 71

మధునాపంతుల జీవన
మధువుల చిందించునట్టి మధు జీవన కా
వ్యధునిన్ మూడవ పాయిగ
విది సాగె వర ప్రసాద కృతి మతి నదులన్॥

# కథాసంగ్రహం.

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి విరచితమైన మహాకావ్యం 'ఆంధ్ర పురాణం'. ఆ కావ్యంపై సమీక్ష చేయించి వారి కవితా వైభవాన్ని తెలిసికోవాలను కొంటుంది చిలుక. భారతి ఆదేశం మేరకు ఊర్ధ్వలోక వాసులై యున్న సంస్కృతాంధ్ర కవీశుల నందరినీ సత్యలోకానికి ఆహ్వానించి, చిలుకయే అధ్యక్షురాలిగా సాహితీ సదస్సును నిర్వహిస్తుంది.

వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు, శ్రీహర్షుడు వరుసగా 'ఆంధ్ర పురాణం' లోని నాలుగు పర్వాలలోని సాహితీ వైభవాన్ని వివరిస్తారు. చిలుక ఆనందించి, ఆపై అయిదు పర్వాలను సమీక్షించే బాధ్యత ఆంధ్ర కవులపై నుంచుతుంది.



# ఆంధ్రీపురాణం సాహిత్యావలోకనం.

చతుర్థాశ్వాసము

భావుకులకు సరస్వతీ దేవి యాజ్ఞ
కవి వరులకు సరస్వతీ కాంత పలుకు
పండితులకు సరస్వతీ వనిత భణితి
యెల్లరకు సభా భేరి మ్రోయించె శుకము। 1

జిలుఁగు వల్కలమంస తలము వీడుచు జాఱఁ
గాళిదాసౌకయింత కల్మిమము నేయ
దండ కమండులు ధారణమ్మున వెన్క
నడుగునడుగున బాణుఁడు గమింప
ముందు పాదము వెట్టనందు శుభ్రిము నేసి
నైషధ కవి రాజు నతులు నేయ
భవ భేషజ కవిత్వ భావ వేదములెంచి
తలవంచి భవభూతి దారి తీయ
లాక్షణిక వరేణ్యులు వచో లాఘవమున
జయ జయ స్తోత్రముల ఘోష సందడింపఁ
గవి వరేణ్యులు ముందు వెన్కలుగ నడువఁ
జొచ్చె వాల్మీకి శారదా సుదతి సభను। 2

అందరు వచ్చినారు సభకాంధ్ర కవీశ్వరులొక్క చోట, మ
ధ్యందిన సూర్య దీప్తి భరతాదులునొక్కట సంస్కృతంబునన్
స్పందన తెచ్చు సత్కవులు ప్రక్కనఁ బండితులన్య భాషలన్
ముందున లక్షణంబులఁ బ్రమోదము గూర్చిన వారు చెంగటన్। 3

నలు ముఖంబుల తేనికి నాల్గు దిశల
వివిధ సాహిత్య సౌహిత్య కవులఁ గూడ
సత్య కవితా సభా మహా సౌధమపుడు
కిటకిటలనాడెఁ జూచు సుకృతి ఫలింప। 4

భారతీ తర్జనీ కృపా పాత్రికమున
నలువ కనుఁ గొలకులఁ బల్కఁ జిలుకఁ జూచి,
కొలువు గన లేచి సవరించె గొంతునంత
భరతుఁడాది సభా ముఖ ప్రార్థనముల। 5

వాగ్దేవీ జుషతామిదమ్మనుచు భావ స్విన్న కంఠంబునన్
వాగ్దైవత్యములైన మంత్రముల చేవన్ సత్య చిత్తమ్ములన్
వాగ్దేవీ పద పద్మ బిందు మధు భావ ద్రవ్య సేవ్యమ్ములన్
స్నిగ్ధ స్విన్న వచః ప్రపంచ భరత శ్రీమావి చేసెన్ ఋత్రిన్। 6

నవ్వఁ గను దోయి యెదహాయిఁ ద్రివ్వఁ బలుకుఁ
గలికి కడకంటి చూపులఁ జిలుకరించె
విధి వచస్సముద్రి తరంగ ఫేన హృదయ
సత్య హృత్పద్మ సూర్య తేజంబు పగిది। 7

విధ్యుక్తంబగుఁ గవితా
రథ్యా యానమున సుకవి రాజన్యులకా
రాధ్యయు యగుఁ దత్పథయం
దాధ్యక్ష్యము నెఱపెఁ జిలుక యావిష్కృతయై। 8

పుట్టను బుట్టినట్టి కవి పూజ్యుఁడు, రామ కథా విధాన సం
ఘట్టనమందునాది కవిగాఁ దొలు పల్కుల బాస కైతయై
కట్టిన పట్టు పుట్టమునఁ గల్గిన వన్నెలకొజ్జయైన యా
దిట్టకు, సత్కవి ప్రభుల దేశికుఁడై చను మార్గ దర్శికిన్। 9

దీవినిఁ బుట్టినట్టి కవి ధీరుఁడు, మా పితృ పాదుఁడున్, బురా
ణావళి సృష్టి సేయుఁ జతురాస్యుఁడు, కౌరవ పాండవేయ గా
థావిధి బోద్ధ, దార్శనిక దక్షుఁడు, వేద విభాగ కర్త, వి
ద్యావివిధాపగాబ్ధి, కవితా విధి పంచమ వేద వాదికిన్। 10

తక్కిన సత్కవిత్వ పథ దక్షులకాంధ్ర కవిత్వ భారతిన్
జెక్కిన నన్నయాది కవి శిల్పులకున్ సకలార్థ తత్త్వముల్
పుక్కిటఁ బట్టు లాక్షణిక పూజ్యుఁడు పాణినికిన్ నతుల్ యశో
భాక్కులలంకృతుల్ నెఱపు వాక్కుల రిక్కల పేఁడ్ల కోటికిన్। 11

నా చెప్పఁ బోవుఁ బలుకులఁ
బ్రాచేతసుఁడాది గాఁగ భవ్యులు విని, వి
ద్యాచక్షుష్కులరసు మీ
తోచినది వచింపుఁడవనిఁ దూరుపు ప్రొద్దుల్। 12

వేదార్థము ఘోషించెడి
గోదావరి తీరమందకుంఠిత భాషా
శోధనలో, సత్కవితా
సాధనలో సత్ప్రబంధ సత్య వ్రతుఁడై। 13

మధునాపంతుల వంశాం
బుధి చంద్రుఁడు వెలుఁగు సుజన పూజ్యుఁడు, భాషా
వధి గాంచుచుఁ దన కైతల
మధువులు చిందించు వాఁడు మాన్యుండాంధ్రిన్। 14

నన్నిభట్టరుండడుగు కెందమ్మి నిలుపు
నింద్ర భూమియు రాజమహేంద్రవరము
ఆచటనతనికి నౌరసుడైన వాఁడు
నఘ విదూరుఁడు సత్యనారాయణుండు। 15

ఆంధ్రి విభూత్తమ స్థితులనారసి, తత్పరిపాలనాత్త నీ
రంధ్ర విశిష్ట ధర్మ గుణ రాజిత రాజ్య రమా కథా యశ
స్సాంద్రతనాలకించి, పెలుచన్ గలమూని వచః పరిపూతుఁడై
'ఆంధ్ర పురాణమై' వెలుఁగునట్టి ప్రబంధము వ్రాసె వాసిగన్। 16

తంద్రికంకితమీయఁగాఁ దలఁచినాఁడు
పితరునానతినౌదలనతికిఁనాడు
వారి హితునకుఁ గృతి సమర్పణము సేసి,
జనకు శ్రోతగఁ జేసి, తా వివిచినాఁడు। 17

అందలి యంద చందములనారసి మీరు వచింపుఁడయ్య. మీ
కందటికాంధ్ర భాష తెలియంగలదాంధ్ర పురాణ కావ్య వి
షయందము నాల్కపై విలచునట్టి వరంబిడు శారదాంబ! స్వ
చ్ఛంద మనస్కులై నలువ సన్నిధి సన్నిధిగాఁ జెలంగుడీ। 18

గీర్వాణాంధ్ర మయ ప్రపంచ కవితా కేళీ విలాసాన, వి
గర్వ స్ఫూర్తిఁ జెలంగి, లోకమున భద్ర ప్రాప్తి శ్రీ శారదా
శీర్వాద స్థితి వాసి గాంచి, రస సంసిద్ధిన్ బ్రపంచించుచున్
నిర్వేందు ప్రతిమానమైన ప్రతి పర్వమ్మెంచె భాషిలపుడీ। 19

కలరు సంస్కృత కవులాంధ్ర కవులు గలరు
కలరు లక్షణ బుధులలంకార విధులు
ముందు కవి కోటి చెవులకు విందు సేయు
నందు సంస్కృతమునకందునగ్రి పూజ। 20

ఏ రీతిన్ గొనియాడనౌనొ। కవితా హేలాఁ ప్రబంధ ప్రభా
స్ఫారోదంచిత భారతీ నవ వధూ పాదాబ్జ శింజాన మం
జీర ధ్వాన విశేష సంగతుల వాసిం గాంచు గీర్వాణ భా
షా రామాయణ భవ్య కావ్య చతురాస్యః పల్కు పాఠిచేతసా। 21

అను చిలుక పలుకులన్ విని
మనమున సింతసిలి. యాంధ్రి మార్దవమునకున్
ఖనియై పరార్థ్య సార్థక
జనియై. యా పుట్ట పట్టి సంభాషించెన్। 22

కాంతా సమ్మితమైన సత్కవనమాకర్ణింప శ్రోత్ర ద్వయం
బెంతే సత్కృతినాచరింపవలెఁ గానీ, స్రష్టయే యైననా
ద్యంతాభావ రహస్స్వరూప పర తత్త్వాప్తిన్ బ్రవర్తిల్లు, ను
స్స్వాంతుండైన మహర్షి తుల్యుఁడుఁ బ్రపంచమ్మున్ జయింపందగున్। 23

బాసకుఁ గాదు వాసి, కవి భావనయందను భావ్యమైన, భా
షా సరసీరుహాంతర రసస్థితి విస్తుల కావ్య కన్యకా
హాసముగా రసజ్ఞ జనులారతువిత్తురు, సత్కరించి, యు
ల్లాసము గూర్చు సత్కవన లాస్యమవశ్యము సుప్రశస్తమౌ। 24

తొలు పల్కులు ప్రభు సమ్మిత
ములు కాఁగఁ బురాణ రాజములు మిత్రములై
చెలఁగఁగఁ గాంతా సమ్మిత
ములుగాఁ గావ్యములు వలపు పొలుపుం జూపున్। 25

ఇరువదినాల్గు వేలు రచియించితి శ్లోకములందు రామభూ
వరుకథ, దానిఁ జూచి పలు బాసలయందనువాద కర్తలై
నెరపిరి వేల కావ్యములు, నేటికి వ్రాయుచునున్న వారలు
ర్వర కవులాంధ్రమందునను వాదము పెక్కురు సల్పి యుండుటల్। 26

తెలుగుఁలపై యభిమానము
గలిగిన నాకిపుడు తెలుఁగు కావ్యంబులపై
పలికెడి భాగ్యము కలుఁగుట
తలఁపున రోమాంచమాయె ధన్యుడనై తిన్। 27

ఏనొక చక్రవర్తి కథ నేపలుకన్ దొరకొంటి, నేడు ప్ర
జ్ఞా విధి యెందరే విభుల గాథలనొక్కఁ గూర్చి, పేర్చి, లో
కానతుఁ గాన్క వెట్టెఁ గదః కప్రపు పల్కులఁ బుల్కలెత్తుఁ గ
ట్పొన రహించి పోయితిని బట్టెద హారతి ధీ వచో రతిన్। 28

గోదావరి తరఁగల వలె
స్వాదు రస స్థితినిఁ బొందు సరసులు, సుజనా
మోదముగాఁ బలికిన కా
వ్యోదయ పర్వమ్మనన్ రసోదయమాయెన్। 29

పర్వములయందునుదయ పర్వమ్మ శ్రోత్ర
పర్వమై సాగెనుర్వీపై పర్వ విధుఁడ
ఖర్వుఁడై సాగఁ జంద్రికల్ పర్వ, నేత్ర
పర్వమైనట్లు తనివోవ సర్వ జనులు। 30

కరుణ రసాభిషేచితము కావ్య కథా గ్రథనమ్ము సంతత
స్థిత పరిణద్ధ శిష్ట కవి శేఖర భృంగ సుమమ్ము, సిస్తులా
ధ్వర వర మంత్ర పూత గుణ భద్రిము సోమ రసమ్ము, ఖండ శ
ర్కర బలె పల్కుఁ దెల్గు నుడికారములాంధ్ర పురాణ హారముల్। 31

అతనికి దీర్ఘాయువు క
ల్గుత, దేవతలు వానిఁ గూరిమితోఁ జూ
చుత, కైతలు పెక్కులు వ్రా
యుత, కీర్తి గడించి సౌఖ్యమొందుత సతమున్। 32

కానక కన్న కాన్పు తన కన్నుల ముంగిట రాజసూయ యా
గానఁబశుత్వమంది బలిగావలెనన్ బలుకాలకించు, భూ
జానికిఁ గల్గు వేదన, మిషల్ పొనరించుట, తప్పఁజూచుటల్
ప్రాణము కంటెఁ బ్రాణమగుఁబట్టికి సర్వము విన్నవించుటల్। 33

కొడుకు భయ భర భ్రాంతుఁడై యడవికేఁగ
రాజు కష్టుఁడౌటయు, రుగ్మతా గ్రస్తుఁడగుట
బ్రతుకుపై యాశ యొక కొంత పట్టువడుట
మరలి వచ్చెడి వేళ భూసురునిఁ గనుట। 34

బాపఁడు పేదరికమ్మున
కోపక దిగులునఁ గృశించి యుంటను గని, తా
నీ పుత్ర త్రయ మందున
నే పుత్రునినైన నిత్తువే యని యడుగన్। 35

తల్లి దండ్రులు మిగుల వేదనలఁబడుచుఁ
బడమిదొర పట్టి! యడుగర యడిగి నావు
కడుపు తీపిని, నీ తల్లి కడుపు తీపి
నెఱుఁగవైతివి, నీవెంత కఠినివోయి। 36

అనుచు విప్రులోక్తులనాడునవసరమున
జాతి గుండియలును నవ నీతమట్లు
కరుఁగకున్నె! కవోష్ణ విర్ఘరముల శ్రు
బిందువులు రెండు కనుగొనల్ విడువకున్నె। 37

యజ్ఞమ్ము సేయ మేధ్యమ్మునై వత్తునం
చొరఁబడు రెండవ కొడుకు పలుకు
నాలించుఁ దలిదండ్రులావేదనలఁదోఁగఁ
గన్నీరు కాలువల్ గట్టి పాఱ,
కడపటి ముద్దులన్ దడపు సందర్భమ్ము
బరువైన గుండెతోఁ బయన మగుట
కుశ పాశముల పాల గుంజకుఁ గట్టుట
యంతలో బ్రదుకుపై యాస పడుట
పెక్కు రీతుల జేజేల మ్రొక్కుకొనుట
యలసిపోవుట. నీటి వేల్పాలకించి
బంధనమ్ములు త్రెంచి, భూపతికిఁగూడఁ
దాపమెడపుట పల్కు విధానమందు। 38

పలుకుఁ బలుకున రసము చిప్పిలఁగ వ్రాసెఁ
గృతికి నారంభమే రస స్థితికి నోచెఁ
బండ బారిన గుండియల్ పిండివేయు
నట్టి కరుణకు నాట పట్టైన రచన। 39

ప్రాచేతసుఁడవ్విధిఁదాఁ
దోచిన పలుకులను బలుకఁ దిష్టిన్ శుకమ
య్యా! చెప్పుమయ్య వ్యాసుఁడ
మా చెవులకు విందు సేయుమా! యని పలికెన్। 40

మధు కోశాత్మకమైన యీ రచన సమ్మానార్హమై వాఙ్మయాం
బుధి సంజాత చిరత్న రత్న ఫణితిన్ బొల్పారి, వాల్మీకి వా
క్య ధునీ శీతమై ప్రభూతమగుఁ దీయంబారి, యస్మద్వచో
వితికిం గల్గునె క్రొత్త తీరులయినన్ విన్పింతు మీ యానతిన్। 41

సాత వాహన పర్వము లేత మావి
చివురు మెసవుచు కృతుల రచించునట్టి
కోకిలమ్మను బిలచి, కొంగ్రొత్తపాట
హంస వాహిని నేర్పిన యట్లు సాగె। 42

కరుణ రస వాహినీ తరంగముల పంక్తి
పొంగి, పొర్లుచు, సుజనాంతరంగ వీధి
తడుపుచున్నది, కన్నీటి తరఁగలల్లె
తడుపుచున్నవి, పుడమిని దచ్చి కడల। 43

రామ రాజ్యమ్ముగాఁ బ్రజా రంజకముగ
పుడమినేలిన యెకెమీండ్ల యెదఁదలందు
నెన్ని వెతలున్నవో, యితులెన్ని గలవొ
బ్రతుకు బ్రతుకున విసపుటామెతల కతలు। 44

కావ్య హోమమాగెఁ గవియ యాహుతి యయ్యెఁ
గృతి యొకింత భూమి పతికిఁ దక్కె
నొక్క కంట నగవునొక కంట వగపాయె
నశ్రు బిందు యుగళమవని బడియె। 45

సాత వాహన పర్వ సంజాత రస వి
శేష సంగతి వర్ణింప భాష గలదె
పలుకుఁ బలుకునఁ గరుణ నిర్భరము కాఁగ
వ్రాసి యున్నట్టి యాంధ్ర కల్హణుఁడితండు। 46

రసవద్ఘట్టములన్ స్పృశించుచుఁ గృతి ప్రాణ ప్రతిష్ఠాపనా
వసరంబెంచు వలంతి పద్య కవితా వైదుష్య వాల్లభ్య సా
రస పీయూషము రంగరింపఁ గలయుద్గ్రంథమ్ము సాహిత్య లా
లసులన్ డోలలనూచి, చూచిన కళా రాకేందు దీపించెదన్। 47

వనమందున రతి కేళివి
మునిఁగిన సమయమునఁ జిలువ ముట్టుటచే, దా
రను, లీలావతిఁ గోల్పడు
మనుజ విభుఁడు దీపకర్ణి మనమురియుటయున్। 48

సంతానము లేకుండట
నెంతయు దిగులొంది, దార మృతికిన్ జింతా
క్రాంతుండై తపియించుట
యింతకునంతగుచు రసము వృష్టిగ మారెన్। 49

ప్రాణమైనట్టి ప్రాకృత భాష విడచి
యొక మహా కవి యడవులందుంట, యచటఁ
గ్రొత్త భాషకు స్రష్టయై మత్తియముల
సరము బోలెడి సత్కృతి సలిపియుంట। 50

తేని యనాదరమును విని
భూనాధుని మెచ్చికోలు పొందని కవితో
ద్యానవన జాత సుమమే
యైననునది పారిజాతమైనను వృధయే। 51

అనుచు గుణాఢ్యుఁడు కావ్యం
బును హోమము చేయు వేళఁ బొడమిన రస వా
హిని పొంగి, పొరలి, పొరలు
లను ముంచదె! యిట్టి కావ్య రాజము గలదే। 52

వ్యాసుఁడీరీతిఁ బలుకనాహ్లాదమంది
సంతసించిన చిక్క ప్రశస్త కావ్య
ములను బలికిన కవికుల తిలకుఁడిపుడు
తగును భాషింపనని కాళిదాసుఁ జూచె। 53

వాగర్థ ప్రతి పత్తిని
సాగిరి కావ్యార్థ సుధల జాలుననీ వి
ద్యాగణనీయ బృహస్పతు
లాగరిమకు మించి చెప్పనగునే నాకున్। 54

కృతివిఁ జాళుక్య పర్వ పర్వేందు రోచి
యాంధ్రి మోమునఁ దిలకమై యందగించె
వ్యాస సృష్టికిఁ దెలుగింటి యాడపడుచు
పుట్టి, బంగరు మొల నూలు పట్టు దట్టె। 55

నిడుద పెన్నెఱి వేణి నీలి రంగునఁ గొంత
సిరి వించి మించుఁ గ్రొవ్విరులు తుఱిమి.
కలువ రేమతుఁ గ్రొత్త కాంతి పూన్చెడి కన్ను
గవకింత కాటుక కలిమి పులిమి.
మొన తేరి సంపంగిఁ బోనాడు నాసికా
గ్రమునందునుక్కు ముక్కరకు గలిపి
శంఖ విస్వనమందు సరిగమల్ సవరించు
గళమందునపరంజి పలక నిలిపి
కేలు దోయికి మురువులం గీలు కొలపి
యడుగు దమ్ములకందెల సడిని జేర్చి
తెలుఁగు పల్కుల కల్కి వన్నెలను బెంచి
నన్నపార్యుండు తెలుఁగులకన్నయయ్యె। 56

భారతమందునొక్క సుర భారతి దక్కఁ గవిత్వ మంజు వా
చా రతి యాంధ్రమందుఁ గనఁ జాలని తేడ్లు. కవి ప్రకాండులా
శా రథ యాత్రి సల్పెడి విశాల జగమ్మునఁ దెల్గు కల్కి సం
చారము సేయఁ జాలమి విచార మనస్కత మౌనమూనుటల్। 57

ఎన్నే వత్సరముల్ గతించినవి గానీ। భావనా శక్తి సం
పన్నుండొక్కఁడునాంధ్ర భారతిని సమ్మానించి నీహార సం
ఛన్నాస్యాంబుజ భాస్కరుండగుచుఁ బ్రజ్ఞా భైక్షమీఁ దెల్గులన్
వెన్నుం దట్టెడు వాఁడు లేఁడను వ్యథల్ పృథ్వీ పతిన్ వేఁచుటల్। 58

రాజ రాజ నరేంద్రుఁడా రాత్రి నిదురఁ
గలత చెందెనో। యేమొ మేల్గాంచినాఁడు
గాంచనున్నాఁడు తెల్గు సంక్రాంతి పథము
వింత పొంతల శాశ్వతా శాంత యశము। 59

తెలుఁగు కబ్బమ్ము లేదన్న వెలితిఁ దలఁచి
ఱేఁడు దుఃఖించుఁ గథను వర్ణించు వేళ,
గంటమాగుట, సుకవి స్వర్గతినిఁ గొనుట
పలుకుఁ దావుల రసము చిప్పిలిన రచన। 60

నన్నయ వర్ణనమ్మునకు నన్నయయే భువికేఁగి శబ్ద సం
పన్నత వ్రాసియుండునను భావము కల్గెను నాకునెన్నియో
వన్నెలు కల్గినట్టి కృతి భావ తరంగ మృదంగ వాదనల్
క్రన్నన వచ్చి శ్రోత్రములఁ గమ్మని రాగములాలపించెడిన్। 61

కవి కుల తిలకుండవ్విధి
నవిరళముగఁ బలుక దెందమానందమ్మున్
గవియగ శుక రాజము "నా
చపులారఁగఁ బల్కు హర్ష సత్కవి" యనియన్। 62

హర్షుఁడు లేచి, శిష్ట కవితాంబుధి యాంధ్రి పురాణమీదఁగా
హర్షమునంది, సత్య సభ యందలి దివ్య కవి ప్రకాండులన్
శీర్షము వంచి, కేల్మోగిచి చేసె విమర్శనమాంధ్రిమందు శ
బ్దర్షి, మహామహుండు తన వ్రాసిన కాకతి పర్వమెంచుచున్। 63

వారిసెన్ క్షత్ర మహోగ్ర నిగ్రహ మహాభ్రాజదాదిత్య సం
కాశోచ్ఛృంఖల కాల వహ్ని రసనా కార్కశ్య రంహః కృపా
ణాశిక్ష్ని పద ఘట్టనార్భట కళా వ్యాలోల రుద్రాంబికా
నైశిత్య ద్ఛవిమత్ ప్రభుత్వ గతి ప్రజ్ఞన్ గాకతీ పర్వమున్। 64

తౌరుష్క పరిభు బుద్ధి జాత తిధిపత్రి ప్రోక్త రాకా నిశా
పారంపర్య కళా వితాన భుగమావాస్యాసి దుర్ధర్ష సం
చారాశేష వికృత్త శత్రుగళ చంచత్ గేందుకాక్రీడ దు
ర్వారౌన్నత్య యశః పరిపూతములు రుద్రాంబాభిదా కృత్యముల్। 65

ప్రియ వాదామృత కూప కంఠజ వచో విన్యాస గాంభీర్య సం
చయ సంపత్ప్రభుతాభిరామ ధరణీ సామ్రాజ్య సమ్రాజ్ఞి, దు
ర్జయ కౌక్షేయక వీతిహోత్ర విజిహీర్షా బద్ధ తౌరుష్క రా
ణ్ణయు హైన్యాఖ్య పతంగముల్ వ్యధలనందన్ జేసె భస్మమ్ముగన్। 66

తత్తద్భవ్య కథా విధాన కథనోత్సాహమ్ము, శబ్దార్థ సం
పత్తిన్ గాంచి, కడాని తావి గొని విభ్రాజిల్లినట్లాయె, వి
ద్వత్తక్రాంట గిరీందరి సమ్మదిత భావ స్ఫార వాగబ్ధి యు
త్పత్తిం జేయఁగ వింద నేయు నవనీతంబీ ప్రబంధంబహో। 67

అని హర్షుఁడు హర్షమ్మున
మనములు తనివోవునట్లు మాటాడిన వె
న్కనె జాణ చిలుక భళిరా।
యని మెచ్చుచుఁ బిదప కవులనాంధ్రుల బిల్చెన్। 68

మధునాపంతుల జీవన
మధువులు చిందించునట్టి మధుజీవన కా
వ్యధునికి నాల్గవ పాయిగ
నిది సాగె వర ప్రసాద కృతిమతి నుడులన్।

# కథా సంగ్రహం

ఆంధ్ర పురాణం మొదటి నాలుగు పర్వాలకు సంస్కృత కవుల సమీక్ష చేసిన తరువాత తెలుగు కవుల వంతవుతుంది. 'నన్నయ' నేను మాట్లాడుట ధర్మం గాదంటాడు. తిక్కన, ఎఱ్ఱన రెండు పర్వాలను గూర్చి ప్రసంగిస్తారు. 'శ్రీనాధుడు' గూడ తాను ప్రసంగించుట పాడి గాదంటాడు. పిల్లల మఱ్ఱి గూడ అట్లే అంటాడు. పోతన ఒక్క విషయం మాత్రమే ముచ్చటించి కూర్చుంటాడు.

అటుపై 'పెద్దన్న' ప్రసంగిస్తాడు రాయల ఆశీర్వాదము మాత్రమే చేస్తాడు. పిదప 'తెనాలి రామకృష్ణుకు', 'నంది తిమ్మన' సమీక్షణం గావిస్తారు. ఈవిధంగా 5 పర్వాలు పూర్తయ్యాక భట్టుమూర్తి, విశ్వనాథ, శ్రీశ్రీ, దేవులపల్లి మొ॥వారు వారి వారి అభిప్రాయాలను సంగ్రహంగా చెపుతారు.

ఇలా సాహిత్య సమీక్ష అయిన పిదప ఆలంకారిక విమర్శనం గూడ చేయించాలనుకొంటుంది చిలుక.



# ఆంధ్రీకవిభాషణం

(పంచమాశ్వాసము)

పర్వమ్ములు నాల్గింటిక
ఖర్వ ప్రజ్ఞుల్ సమీక్ష గావించిరహో
గైర్వాణులు, తదుపరి యాం
ధ్రోర్వీ సతి కథపు పంబలూనుఁడు వలుకన్। 1

అని చిలుక వలుక సభ్యుల
కను దమ్ములు విచ్చికొంచు గౌరవ్యుఁడు, వా
గనుశాసన భాస్కరు మా ఖ
మును మఱి-మఱి చూచు రక్తి మూరిం బోవన్। 2

నన్నయ లేచి, సత్కవన నాథులకుం బ్రణమిల్లి, శబ్ద సం
పన్నత కైవసమ్మయిన మాన్యులు వల్కిన వెన్కఁ బల్క, వి
ద్వన్నయశాలినొక్క! రస వైభవ చంద్ర సహస్ర శక్తిలో
గొన్న సభా స్థలమ్మునకుఁ గోరిక దివ్వియ పైనిఁ గల్గుటా। 3

ఎక్కటి జాణ యౌచు రచియించిన యా మధు మూర్తి కైతలోఁ
జిక్కని పాయసాన్నములు చేరువగా సుఖియింపఁ జేసి. పె
మక్కువఁ జూపినారిదియు మాకు ముదావహమాయెఁ గాని, నా
కెక్కడి శక్తి యా మధుపులీఁగవితాంధ్రికినిట్టి విందులోన్। 4

అదియును గాక నా నుడివినట్టిది భారతమందునెన్నియో
గదిసెను బల్కు వెన్నెలల కాంతులటంచు వచించినాఁడు. మీ
రది గమనించినారు పలుకాడిన లోకము సంశయించు, సౌ
హృదమున గాంచి, నేనొసపరిన్ బ్రచురించెదనాశిషంబులన్। 5

అని యధివసించు నన్నయఁ
గని కీరము నేయునట్టి కను బాసలు గై
కొని లేచినాఁడు తిక్కన
సుపిశిత వాగ్ఘాట రచనఁ జూపెడి వాఁడై। 6

అనితర సాధ్యంబయ్యెది
'పునఃప్రతిష్ఠాఖ్య' పర్వమును గాంచిన నేఁ
దనివోయితిఁ జషకమ్మది
గొనుటకునై వేఁపుగిడ్డి కొలమునఁ బాలన్। 7

కాకతీయుల యా యోరుగలు పతాక
తెప-తెపలనాడి క్రిమముగాఁ బ్రిదిలి పోవ
నధివసింపఁగ జంద్ర ధ్వజాంకురములు
ప్రోలియాఖ్యుఁడు పెలు తేండ్లఁ బోనడంచె। 8

మునునూరి ప్రోలయాఖ్యుం
డొసపరి సామంత విభుఃనొక్కట విలుపన్
వెసఁ బూనుకొనిన విధమది
యసదృశముగఁ జెప్పి, పాత్రకాయువు నింపెన్, 9

అన్నవ సూప సంగరమునందునఁ గాపయ నాయఁడొండు, నా
పన్నుల నేయ శాత్రవుల భప్యుఁడు వేమయ భూపుఁడొండు, వా
రన్నశినాహితా-బుజహితాక్షుఁడు, కవ్వడి కూడినట్లుగాఁ
గ్రన్ననఁ బూనినారనుట కైతకు భాష్యము చెప్పుటే గదా। 10

ఆనపోతారెడ్డి బలం
బనవేముని వితరణమ్మునందంబుల లో
తునసీదులాడి వలుకుచు
మునిమాపునఁ జెదల నుడులఁ గ్రుముగ్గుబ చెక్కెన్। 11

నాట్య శాస్త్రమ్మునాపోశనమ్ము వట్టి
వ్రాయనోపె వసంత రాజీయమునఁగ
రాజ్యమేలుచునే కుమారగిరి రెడ్డి
యాతని వర్ణింపఁ బరవశుఁడాయె సుకవి। 12

అతని పై దుష్యమిట్టిది యట్టిదనక
నుడువుఁ బట్టునఁ జూపెనన్నవ యొకంతు
కాళిదాసార్య కృత నాటకముల కొఱకు
సలిపె వ్యాఖ్యానమదియవో సాక్షి యనుచు। 13

రావు సింగ మహీపాలు ధీవిశాలు
దర్శనము చేసికొని శారదా స్తవంబు
పలికె శ్రీనాథ కవి సార్వభౌముఁడనుచుఁ
బలుకుఁ బట్టుననెట్టి శిల్పంబు విలిపె। 14

పలుక దగినట్టి తావులఁ బలుకుచుండు
పలయుఁ దావులఁ బాత్రలు పలుకుచుండు
నుడువుఁ దడవుల నుడులలో నొడుపెరింగి
నాటకీయతకిందుఁ బ్రాణమ్ము నిలిపె. 15

శబ్దములు కైంకిరాతాస్త్ర చయము నేసి
ఎడద తోతులలో రస సృష్టి నేసి
కైతలను జెప్పఁగా హౌను కాఁడితండు
వాని కబ్బమ్ము నిలుచును బహుంతిథమ్ము. 16

చెలువము చిందునందఁగ, విశిష్టములైన కవిత్వ సంగతుల్
పలుకఁగ దిక్కయజ్వ, పరిణవమ్ము విరించి వచించునట్టులై
పొలుపును గాంచ మూర్ఛవలు వోయెను డెందములందునందునన్
దెలుఁగులు తెల్గు కైతఁ గల తీపులు చూపిననందగింపదే. 17

పరవశించిరి సభలోని వారలెల్ల
చిలుకకానంద బిందువుల్ తొలకరింపఁ
జిలుకరించుచు వాని వాక్కులను దడపె
నదియు యాశీస్సుగానెంచి, యధివసించె. 18

దస్యుఁడీతఁడు మాదు డెందాల దోచు
హొంతకారి యితండు, వేరొకటి చదువ
బుద్ధి పుట్టఁగనీడంచు మొదలు పెట్టి
చెప్పెనెట్టిన సూక్తి వైచిత్రి జావిపి. 19

చతురంభోధి పరీత
క్షితి దల సామ్రాజ్య లక్ష్మికిం బతులై, శా
శ్వతులౌచు విల్తురే? యు
ద్ధతమగు శాశ్వత పదమ్ము దక్కను గవికే. 20

స్ఫురదరుణాంశు రాగ రుచి, బొంపిరి వోవ, విరస్త నీరదా
వరణముగా, దశత్కమల వైభవ జృంభణముల్లసిల్లను
ద్ధురతర హంస సారస మధువ్రత విస్వనముల్ సెలంగఁగాఁ
గరము వెలుంగు శారద ముఖానకు ముంగల యీ ప్రబంధమే. 21

పర్వము విద్యా నగరము
శర్వుని తలపైని తొడవు చారుతరంబై
యుర్వర వెలిఁగిన కళణిన
ఖర్వముగాఁ జెలఁగె బాస కైవసమగుటన్. 22

హరిహరునిఁ గూర్చిఁ బలుకుచు
ధరపై హరిహరులు గలసి, ధర్మమ్మును స
త్వర గతి పెంచుచు శత్రులఁ
బరిమార్చునటంచు నుడువు వైనము గంటిన్. 23

అనుజుల్ వెంటఁ జరింపనా హరిహరుండాఖేట సరంభ శ
క్తిని గాంతారము చేరి, యందునొక కుందేటిన్ వడిం బట్టఁ జూ
చినసయ్యాతని వేటవేఁపిఁ దటిమెన్ శీఘ్రమ్ముగాఁ జిత్రమై
కనఁ పట్టన్ శశమందు విక్రమ గుణోత్కర్ష స్థితిన్ సాగుటల్. 24

విద్యారణ్యుల మోశిలను
హృద్యముగా నుడివినట్టి యీ కథ రస సం
పాద్యమ్మై పాఠకులకుఁ
జోద్యమ్మై బాస వాసిఁ జూఱం గొనియెన్. 25

విజయ నగర సామ్రాజ్యమ్ము విజయమంది
మనును ద్వరగతిఁ గాంతారమునకుఁ బోయె.
తరులఁ బెకలించి, పిలుపు మందిరమటంచుఁ
జెప్పె సుముహూర్త మొండు దేశికుఁడునాఁడు. 26

కలిమిన్ బెంచు ముహూర్తమెంచుకొని శంఖధ్వానమున్ జేయ, నా
దలఁ దాల్పంతగు దేశికోత్తముని. విద్యారణ్యు లవ్యాజ్ఞ మూఁ
దలగా భావన సేసి శంకువునటన్ స్థాపింపఁగాఁ బూన, న
వ్వలనాత్మంభరి యెవ్వఁడో సలుపు రావంబాకసంబంటుటల్. 27

ఏది గురూత్తముంతు వినిపించిన నాదమొ? యేది భిక్షువా
హ్లాదము మీరఁ జేసినదొ? యన్విషయమ్మెఱుగంగరాక యా
సోదర పంచకమ్మెదురు చూచుచు. వేచుచుఁ జూచి. చూచి. క్ర
వ్యాద ముహూర్తమందు నిలుపన్ సమకట్టెనదృష్టమెట్టిదో. 28

అట్టి కథా కథనము జగ
జెట్టిగ వినిపించినాఁడు చిత్రమ్ముగనే
పుట్టువునందీ విద్యల
బట్టెనొ? యీ పుట్టువునకు భాగ్యం బబ్బెన్. 29

నాచన సోమనాథ కవినాథ నవీన గుణమ్ము లెన్నియో
తోచినవేమొ! తత్సుధలు దోయిలి పట్టి గ్రహించి మించెనో!
వాచవులూరునట్లు రస వైభవముల్ ప్రచురించె మల్లియల్
పూచిన కైత తావులకుఁ బుట్టిన యిల్లు, రహింపనుల్లముల్। 30

ప్రౌఢ దేవ రాయందు విద్వజ్జనాళి
కాలవాలము సేసె ముత్యాల శాల
కంచు ఢక్కను మ్రోగింపఁ గలిగినట్టి
గౌడ డిండిముఁడాస్థాన కవియు బుధుడు। 31

అతి వాక్ప్రౌఢుఁడు, శాస్త్ర కోవిదుఁడు శాస్త్రార్థమ్ము వాదింపను
ద్యతుఁడౌ డిండిమ భట్టు ఢీకొనఁ టకై యావత్ప్ర పంచానతు
న్నతుఁడై శాస్త్ర వచో విరించి యగు శ్రీనాథుండు కావ్యార్థ వా
క్పతియై వచ్చి, జయించి, డిండిముని ఢక్కన్ మూగవోఁ జేయుటన్। 32

కవి సార్వభౌమ బిరుద
చ్ఛవిలో, కనకాభిషేక సంరంభములో
భువియే కస్దమ్ముల గౌ
రవ హారతినీ వెలింగె బ్రాహ్మీమయుఁడై। 33

దాని వర్ణించునట్టి సందర్భమందు
మేలి ముత్యాల శాలయన్ బాల కదలి
లక్ష్మి శ్రీనాథుఁ జేర, హాలాహలమ్ము
కడఁగి యా డిండిమ కవీశ్వరుఁడు, గ్రహించె। 34

అని చమత్కృతినొందు వాకొనుట యన్న
జగతినెందేని సామాన్య జనికిఁ దగునె?
శివుఁడు డెందాన దాగి వచించెనేమొ।
వెన్నుపానుపు పుడమిపై వెలసెనేమొ। 35

ఈరీతినెల్లనార్యుఁడు
సారార్థము గుఱియు ధీ వచస్స్ఫూర్తి వినుపన్
దోరమ్ముగ నన నీశుల
నారతిఁ గైకొనియెఁ గీరమామెతగాఁగన్। 36

పిదపఁ గనకాభిషేక సంపదలఁ గొన్న
ఘనునిఁ గవి సార్వభౌమునిఁ గనియెఁ జిలుక
భారతీ దేవి దాల్చెఁ బుంభావమనఁగ
వినిచె శ్రీనాథుఁడౌచిత్య వేత్త యగుచు। 37

మా కనకాభిషేకము చమత్కృతి మత్కృతినక్షర ద్యుతిన్
లోకమునందు నిల్పిన పరిలోకము గొప్పతనంబు చూపినన్
లోకము సంశయాస్పద విలోల మనస్కతనెంచ వచ్చునా
లోకిత విద్వదర్పన నిరూపణనిచ్చెదనాశిషంబులన్। 38

శ్రీనాథుండవ్వీధి మది
లోనలిమానము, పరిసంగ లోకజ్ఞత సం
ధానించి, సుకవి పొందిరి
నానిన ధ్వని రస పటుత్వమరయుచుఁ బల్కన్। 39

'వాణి నా రాణి' యన్నట్టి పలుకులోన
'నా' యనంగను 'నవఁగ' యనంగఁ జెల్లు
వాణినా - రాణి యే గాదె బ్రహ్మకనఁగ
నచుచు నా పల్కుఁ బల్కులనను వదిఁచె। 40

అట్టి కవి రాజు గూర్చి నాకగునె పలుకఁ
జాడి గాదది యాతనిఁ బ్రస్తుతింప
ననుచు శ్రీనాథు మార్గమ్మననుసరించి
పలుకఁదవ్వేళ పిన వీర భద్రి కవియు। 41

'పరమ భక్త చక్రవర్తి పోతన కవి
రస కవిత్వ సృష్టి ప్రాణ యష్టి'
యనుచుఁ బూర్వ కవుల యభ్యున్నతుల శ్రేణి
నన్నుఁ గూడఁ జేర్చినాఁడు సుకవి। 42

ఐనమనొక్క మాట, తమ యంతటి వారనుఁ బోరగండ్రకు
ద్యాన వనమ్ములో, విరుల తావులలోఁ దని వోవఁ జెల్లున
యాఖ్య నవలందగించుటకునై పితరుల్ శ్రమియించిరన్న వి
జ్ఞానము లేనినాఁడు కొడుకా? యతగాఁడొక పూర్వ దేవుఁడా?। 43

ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి, పురంబులు నాహనంబులున్
సొమ్ములు కొన్ని పుచ్చుకొని సొక్కక తండ్రికి విచ్చి, వాని మి
త్రమ్మునకంకితంబొసఁగు ధన్యుఁడు, పూర్వ నరేంద్ర కీర్తి సౌ
ధమ్ములు గట్టి సేయఁ గల దక్షుఁడు దీవెనలిచ్చి మెచ్చెదన్। 44

ఈ కరణిని బోతన్నయు
వాకొని కూర్పుండ విడపఁబలుకఁగ విద్యా
శ్రీకాన్త పద పద్మం
బౌ కవితా పితామహునకవసరమాయెన్‌। 45

ఎఱరైనచో దన మద కరీంద్రము డిగ్గి,
కేలూత యొసఁగి యెక్కించుకొనియె
మను చరిత్రంబందుకొను వేళ బురమేగ,
పల్లకి తన కేల బట్టి యెత్తె
బిరుదైన కవి గండ పెండేరమునకీవె
తగుదని తానె పాదమున దొడిగె
కోకట గ్రామాద్యనేకాగ్రహారంబు
లడిగిన సీమల యందువిచ్చె
నాంధ్ర కవితా పితామహ యల్లసాని
పెద్దన కవీంద్ర యని నన్నుఁ బిలచునట్టి
కృష్ణరాయల గూర్చి వర్ణించు బర్వ
మభినుతించుట కంటె భాగ్యమ్ము గలదె?। 46

ఆ పర్వంబది యొక్క యెత్తు. కవితా వ్యాపారమందొక్క 'శై
ష్యోపాధ్యాయిక' యొక్క యెత్తు. గురు శిష్యోద్యోగ వైచిత్రి, శ్రి
ద్ధాపారీణత, శాస్త్ర దృష్టియునునాత్మ ప్రత్యయ క్షేత్ర వి
ద్యా పాండిత్యములేర్పరింపఁగల యాదర్శమ్ముగా సాగుటన్‌। 47

విరతము నేను దోడుగనె విల్చితి రాయలఁ గూడి. నాకున
బ్బురమగునట్లు, మా విభుని మూర్తిఁ జిత్రణచేసి వానికిన్
గురుఁడగునట్టి తిమ్మరుసు కూర్మిగఁ బేర్మి వచించునట్టి వై
ఖరిఁ గనుగొంటిఁ దెల్గునుడికారములా! యర విచ్చు తుల్లియల్! 48

అన్న యయ్యును దమ్మునినంధుఁ జేయఁ
గడుఁగు నరసింహ రాయని కపటమెంచి
వాని వంచించి, కృష్ణుని భద్రి పఱచు
తిమ్మరుసు యుక్తి చిత్రణ తెలియునగును। 49

'అలసుఁడు లోభ మోహ జనుషాంధుఁడు తేవికి నేడు కృష్ణ రా
యల కనుగ్రుడ్డు కావలయు నా!' యను మంత్రి తలంపునందనా
విలమగుఁ గృష్ణ వత్సలత; విద్విష కోటిఁ దంచు శక్తి యు
క్తులఁ గల ప్రీత్యయమ్ము మృదు ధోరణిఁ జెప్పు వలంతి యాతఁడే। 50

పట్టాభిషేక ఘట్టం
బట్టిట్టని చెప్ప రాని యట్టిది, కవి హోం
బట్టు కలఁ బోసి. నేసిన
పట్టుం బుట్టమ్ము కైత పదఁతికిఁ గట్టెన్। 51

వైదిక జ్ఞానమెంతఁగాఁ బట్టు వడెనొ!
విధి విధానము సాంతము విశద పఱచె
ఇంద్ర శాంతినిఁ గూర్చి వచించినాఁడు
మృత్తికా స్నానమందు వచించినాఁడు। 52

తిరిగి కలశాభిషేకమ్ము తెలిపినాఁడు
భద్ర గజముపై సాగుట పలికినాఁడు
మాతృ పాదాభి వందన మహితుఁడగుట
చెప్పినాఁడది తాఁ జూచి, చెప్పినటులె। 53

సమయోత్పన్న సదాశు శిష్ట కవితా సామ్రాజ్య పట్టాభిషే
క మహోత్సేకము వాని సొత్తగుట సంఖ్యావశిత్వకాండుండు. భా
వ మహాదాయత్తము కాఁగఁ గైత బహుదా పట్టాభిషేక క్రియా
రమణీయమ్ముగఁ దీర్చె, రాయనికి భద్ర ప్రాప్తి చేకూర్చుచున్। 54

ఆ వైనంబది యేమొ గాని, కవితా వ్యాపారమందెంతయో
భావావేశము నిండి, పండినటులై, పట్టాభిషేక క్రియా
దేవచ్ఛందమలంకరించెఁ బలుకుం దేవేరికై. శిష్ట భా
షా వారాంనిధి జాతుఁడై వెలుఁగునా జైవాతృకున్ మెచ్చెదన్। 55

పలుకుం గన్నియ తోడుగా నడుచు వాగ్వైదుష్యమేపార రాఁ
గల పర్వమ్మున నాదు వైభవము వక్కాణించుటం జేసి, నా
పలుకిం గూడదటంచు డెందమున సంభావించియుం గూడ, రా
యల కీర్తిన్ మఱియొక్కమారిచటఁ బల్కాడంగ నేఁ బూనితిన్। 56

తనివోయితి ధన్యత్వము
గొనుటన్ నేనింక సెలవు గొఁయెదనని పె
ద్దన పల్కె. యధవసింపఁగ
గని, కీరము సత్కరించెఁ గను సన్నలతో। 57

రాచరికపు ఠీవులతో
వాచవులను నింపఁ బలికె వాక్పతి యెదుటన్
శ్రీచక్రి చరణ సేవా
ప్రాచుర్యుఁడు కృష్ణ దేవ రాయలు సతుఁడై। 58

సైరంధ్రి కుసుమ ధారా
సార చరచ్చంచరీక సంకుల కల ఘం
కారానుకారి, సంస్తవ
కారియగా మచ్చరిత్ర గానము సేసెన్। 59

ఒక్కటను గాక సుకవితోద్యోగమదర
రెంటు పర్వాల మా కథ పండఁ జేసెఁ
బలుకకున్నఁ గృతఘ్నతా భయము తోఁచుఁ
బక్షపాతమ్ముఁగాఁ దోఁచుఁ బలుకఁ బూన। 60

కావున దైవతమును సం
భావన సేయంగనగును బద్య కవిత్వ
శ్రీ వైదుష్య మహౌజః
ప్రావృట్కాలమ్ము నిలిచి వానిం దడుపన్। 61

పూని ముకుందుజ్ఞ కను బొమ్మెనె గాంచి, యజాండ భాండముల్
వానను మీఁద బోవ నడువన్గొనెఁ దన్నసవ్యగ్ర పిశ్చల
త్వానుచలత్వ నిష్ఠలె సమస్త జగంబుల జాడ్య చేతనల్
గా నుతికెక్కు సైన్య పతి కాంచన వేత్రిము వా నోముతన్। 62

హరి పూరింపఁ దదాస్య మారుత సుగంధాకృష్టమై, నాభి పం
కరుహ క్రోడ మిళింద బృందమెదురెక్కం, దుషిక్రియా పంక్తి సం
కర దైత్యాసు పరంపరం గముచు రేఖం బొల్చు రాకా నిశా
కర గౌర ద్యుతి పాంచజన్యమొసఁగుం గల్యాణముర్వావికిన్‌। 63

సరస చక్రవర్తి సంగీత సాహిత్య
సమర సార్వభౌముఁడమృత మూ
యవ్విధముగఁ బల్కి యధివసింపఁగఁ జిల్క
ప్రస్తుతించె మౌన భాషణముల। 64

అగ్రి శాఖిశా కోకిలంబైన వాఁడు
కలిమి పద గుంఫనమువందుఁ గలఁగు వాఁడు
పాండు రంగ మాహాత్మ్య ప్రబంధ కర్త
భవ్య మతి రామ కృష్ణుఁడు వలుకఁ దొడఁగె। 65

పలుకుం దొయ్యలి మోవి కాంతికెనయౌ భాగాలునయ్యంతి చె
క్కులఁ బోఁడం దెలనా కుల మ్మువిద పల్కుల్ వంటి కప్రింపఁ బ
ల్కులతోఁ గూడిన వీడియంబుగఁ గృతిన్ రూపించి, భాషించు న
ప్పలుకుల్ వింటివి, యందునన్ విజయ పర్వంబెంచి, భాషించెదన్। 66

ఉదయంబస్త నగంబు సేతువు హిమ వ్యూహంబునున్ జుట్టి రా
విదితంబైన మహిన్ మహాంధ్ర కవితా విద్యా బల ప్రౌఢి యం
దెదురేరీ! యసిధార ద్రుకొను వారేరీ! కళా శాస్త్ర శా
రద తద్రూపముఁగా వెలుంగఁదగుఁ గర్ణాట ప్రభుఁడీ కృతిన్। 67

ద్వైగుణ్యంబుగఁ గీర్తిఁ గాంచెను. రసాపారాబ్ధి జైవాతృకుం
డౌ గౌరవ్యుఁడు. కృష్ణ రాయ సమర వ్యాపారమున్. సాహితీ
యోగంబున్ లిఖియించి యుండుటఁ బద వ్యూహంబు సందర్శనం
బై గైర్వాణినినాంధ్రి యుందతఁడు వహ్వా! వ్రాసెనా పొత్తమున్। 68

విజయ పర్వానఁ గర్ణాట విభుఁడె గాదు
విజయమందుల, కవి గూడ విజయుమందె
ఉదయ దుర్గ రణమ్మునం బదను జేసి
కత్తియే గాదు కవిచేతి కలముఁ గొనియె'। 69

ప్రహరేశ్వరుఁడును, రాయలు
సహమహమిక ద్వంద్వ యుద్ధమారంభింపన్
సహ జాతమ్ములు పదములు
సహమహమిక తోడ లాస్యమాడం దొడఁగెన్। 70

కొండవీటి ముట్టడిని వాకొనెడి వేళ
మొత్తముగనాంధ్ర భాషనే ముట్టడించి,
కైవసమ్ముగఁ జేసికోఁ గలిగినాఁడు
కాక కవనా ఖాండవోత్కర్షయేమి। 71

కటక పురి జైత్ర యాత్రకై కదఁగు వేళ
శత్రు వాహినిఁ గూల్చ దుస్సహము కాఁగ
తిమ్మరుసు చూపు యుక్తుల తీరుఁ దెలుపు
సూక్తి యుక్తుల కవి యనురక్తి మిన్న। 72

కయ్యమునకేఁగి రాయలు వియ్యమంది,
గజపతికి యల్లుఁడై పట్టి కరము గొనఁగ
యుద్ధ వర్ణనమ్మొనరింపనుత్సహించుఁ
గవి కరమ్మందె, సుకవితా కాంత రహిని। 73

కృష్ణ రాయుని సాహితీ తృష్ణ భువన
విజయ సభ చెప్పఁ దత్సభా విషయమందు
నాటి కవి రాజ కవన విన్యాస పటిమ
యావహించెనో! పరవశమంది పలికె। 74

ఒదయుఁ డానాఁడు పెద్దన యదుగుఁ దమ్మి
పెండెరమ్మును దొడిగెడి విధము తెలుపఁ
దాని చిఱు మువ్వ సవ్వడి తాకినట్లు
మా చెవుల సోకెనాతని మధుర కవిత। 75

ఈ చివురాకునీ ప్రసవమీపువుఁ దేనియ యెంత యొప్పెడిన్
జూచితిరే యటంచుఁ దన చుట్టు శుకాదులు గొల్వఁగాఁ గప
ర్దాచిత చంద్ర గాంగ జలమైన శివాహ్వయ కల్ప శాఖి. వి
ద్యా చణుఁడైన వాని కవనాబ్ధిని వెన్నెల మాడ్కిఁ జూచుతన్। 76

అనుచునాశీర్వదించి తానధివసింపఁ
బలుకుఁ బూఁబోడి చేఁ జిల్క ప్రస్తుతించి
గారవించినదొక శిరః కంపనమున
నపుడు తిమ్మన లేచి పల్కాడఁ దొడఁగె। 77

తన మృదు గీతికా పరిణత ధ్వని వైఖరిఁ బల్కు మంచు, మిం
చిన రహిఁ జేతి వీణియకుఁ జెక్కులు గీటుచు నేర్పుచున్నదో
యన నఖరాంకురంబుల, నయమ్మునఁ దంత్రులు మీటి, గానమిం
పొనరఁగ జేయు భారతికినుత్సవమాంధ్రి పురాణ కావ్యమే। 78

పలుపు కవిత్వ వైఖరికిఁ బట్టము గట్టిన సత్కవీంద్రుఁడై
వలచి, కవిత్వ తత్త్వ రస వైభవమాంధ్రికిఁ బంచి యిచ్చి, సు
స్థిరమగునట్టి గౌరవము చేకొనె, నాయక రాజ పర్వ నుం
దర తర భావ పద్మ మధు ధారల ధోరణి ముంచి వైచుచున్। 79

నాయక రాజ పర్వ కవనమ్ము కరమ్ము వరమ్ము కాఁగ, వి
ద్యాయత మూర్తిః కాశ్యపి బృహస్పతి, జాణ, 'కళా ప్రపూర్ణుఁడౌ'
రా! యని లోకమెల్లఁ గొనియాడఁగ వాసినిఁ గూర్చి పెట్టినా
త్మీయత కొంత కన్పడు, సుధీమణి చేయఁ బరాంబికా స్తుతిన్। 80

పోర్చుగీసులతో, రణమ్మునకుఁ గడఁగు
విభుఁడు రఘునాథ రాయని విక్రమమ్ము
పలుకఁ బట్టునఁ గవి చేతి కలము గూడ
నెంతగా విక్రమించె, వర్ణింపఁ దరమె। 81

చిక్క రాయలు పట్టాభిషిక్తుఁడగుట
జగ్గ రాయఁలకది మనశ్శల్యమగుట
వాని సకళత్ర పుత్రుని బంధనమున
నుంచి యుక్కివుఁడౌచు బాధించు వేళ। 82

అందు యాచమనీఁడనునట్టి వాఁడు
ఒక్క రజకుని రావించి. యుక్తి పన్ని
వాని కడగొట్టు బిడ్డనీవలకుఁ దెచ్చి
కోరి యభిషిక్తుఁ జేసిన తీరుఁ దెలుప। 83

పలుకు పలుకునఁ బలుకులం గులుకు దేవి
లీలనభిషిక్తయై సోయగాలు పోయె
నామెయే గాదు వీర రసాభిషిక్త
యాంధ్రియును నయ్యెనాకథ నాలకించి। 84

విజయ రాఘవ నాయక వితరణమ్ము
లోక లోకాల యందునాలోకితమ్ము
అన్న దాన వైభవమెంచునవసరమునఁ
దదర్థిసాన్న ప్రదానమ్ము తనియఁజేసె। 85

అతివృష్టిని లోకమ్మున
స్థితి గానని యపుడు కూడ చేసిన దాన
వ్రత వైభవమెంచుట సు
వ్రతుఁడౌచుఁ గృతార్థుఁడాయె భాషావృష్టిన్। 86

“మావి చివురంత యేనియు మంట రాదు
వచ్చునో। పాచకుల కంటి వాన వచ్చు”
అను చమత్కృతినుత్కృతి గనిన యట్టి
వానికానందమునఁ గంటి వాన రాదొ। 87

రంగ ధామేశ్వరియ వచ్చి, రసవతీ గృ
హమ్ము సొచ్చి పచనము స్వయమ్ము సలుపు
సంగతినిఁ దెల్పనీశ్వరి స్వయము వ్రాసి
వచ్చెనో గాక, రసమంత పక్వమగునె। 88

వాసిన్ గాంచిన ఘట్టమున్నయది చెప్పన్ రంగ ధామేశ్వరీ
నాసా భూష యదృశ్యమై, రసవతిన్ నాథుండు కన్గొంట, దే
వీ సాన్నిధ్యమ్ము చేర్పఁ బడ్డ కథ తృప్తిన్ విన్న మా డెందముల్
మా సావాసము వీడి, యా కవిని సంభావింపఁ జేరెన్ భువిన్। 89

సరసవుటల్కఁ దీర్పఁ దటి శార్ఙ్గ సుదర్శన నందకాబ్జ సం
భరణ గుణాప్తి నెన్నడుముపైఁ గటిపై, జడపై గళంబుపై
హరి నలుగేలు పైకొన సుఖాంబుధి నిచ్చటనోలలాడునిం
దిర సుఖమిచ్చుఁ గాత కవి ధీరునకాంధ్రి పురాణ కర్తకున్। 90

అని యిట్లు పలికి, కవి తి
మ్మనయును దానధివసింప మహితుఁడు భళిరే
యని తలపోయుటఁ జిలుకకుఁ
గను గొలుకులు చెమ్మగిలుట కవికిం జెప్పెన్। 91

శ్లేషలు పెక్కు లేవు, పరిశీలన సేయఁ బ్రిబంధ వర్ణనల్
భూషణముల్ కనంబడవు, పోరికి రాదొక యింత యేని, సం
తోషము గూర్పఁ గారణము తోపనిదాంధ్రి పురాణమేలకో
భాషకునందఁ జాలని పరిభావము గాంచెను గుప్తశిల్పమై। 92

అనుచు భట్టు మూర్తి కవీశుఁడభినుతించె
లలిత నిర్వహణమ్ము సూరనయు మెచ్చె
శాంకరీ స్తుతి మెచ్చి, ధూర్జటి రహించె
రామ భద్రుఁడు సుకవితారామమనియె। 93

నా పుట్టుట ధన్యత్వం
బే పుడమికిఁ గల్గెనదియు యీతనిఁ గనుటన్
నా పేరఁ బిలచుకొంటయు
నైపుణి భువికంచు విశ్వనాథ వచించెన్। 94

ఏ దేశ చరితమయ్యును
గాదేదియుఁ గూడ గర్వ కారణమనుచున్
వాదాడితి గానీ యో
రా! దీనినిఁ జూచి, మిగుల యబ్బుర పడితిన్। 95

శేదీల్ దస్తావేజులు
కాదంటిని చరితమన్నఁ గానీ యిది య
య్యా దృష్టిని నడపింపక
సాధించెను ప్రగతి యనఁగ సాగెను శ్రీశ్రీ। 96

కృష్ణ పక్షమ్ముతోనుర్వి క్రీడలాడు
సాహితికి లేదు శుక్ల పక్షమ్మటంచు
నా తలంచెడి వేళఁ బున్నమియు వచ్చె
పర్వమిది యంచు దేవులపల్లి పలికె। 97

ఈ రీతినిఁ గవులెల్లరు
సార్థ వచో విశేష సంభారమునా
సారముగాఁ గురిపింపఁగ
నౌరా! యా సత్య లోకమంతయు మునిఁగెన్‌। 98

పులకలు మొల్కలెత్తెఁ గవి పోఁడిమి, యాంధ్ర పురాణ కావ్య వి
స్తుల రస వైభవమ్ముఁ బరి తోషిత శిష్ట కళా విశేష దో
హల పద గుంఫనమ్ము, నుషమానిత్వ భావ విచిత్రి కల్పనో
జ్జ్వల కథనమ్ము గాంచి, రస భావ తరంగిత మైన చిల్కకున్‌। 99

వా చవులూరఁగాఁ గవన వైభవముల్‌ ప్రచురించు మీ నుడుల్‌
మా చెవులార వింట పరమంబగు భాగ్యము, యోగ్యులైన వి
ద్యా చణులార! మా యెడఁ గృతజ్ఞతలన్‌ గొనుఁడయ్య! కావ్య లీ
లా చతురుండు చేసిన యలంకృతులన్‌ గనఁ గోరుదీపయిన్‌। 100

ఆలంకారికులారా!
లాలింతురు మీరు కావ్య లలనా మణి భూ
షా లాలిత్యము గఱపుచు
నాలించెదఁ బలుకుఁడెల్లి యనుచు వచించెన్‌। 101

మధునాపంతుల జీవన
మధువులు చిందించునట్టి మధుజీవన కా
వ్యధునినినైదవ పాయిగ
నిది సాగె వరప్రసాద కృతి మతి నుడులన్‌।

## కథా సంగ్రహం

'ఆంధ్ర పురాణ' కావ్యాన్ని గూర్చిన ఆలంకారిక సమీక్ష చేయించా లనుకొంటుంది చిలుక. సభను సంసిద్ధం చేస్తుంది. త్రిమూర్తులు. త్రిదేవు లతో బాటుగా సమాయత్తమవుతారు. కవులు ఆలంకారికులు విజయం చేస్తారు. చిలుక అధ్యక్షోపన్యాసం గావించి, సమీక్షణం గావించవలసిందిగా ఆలంకారికులను ఆదేశిస్తూ అగ్రతాంబూలం భరతునికి ఇస్తుంది.

క్రమంగా భరతుడు, భామహుడు, దండి, వామనుడు, రుద్రటుడు భట్టలోల్లటుడు, భట్టనాయకుడు, శంకకుడు, అభినవగుప్తుడు ప్రసంగిస్తారు. పిదప ఆదంద వర్ధనుని వంతు రాగా ఆయన సిద్ధాతం నాసిద్ధాంతం పరస్ప రం ఏకీభవిస్తాయి కనుక నేనే ప్రసంగిస్తానని జగన్నాథ పండిత రాయలు అభిభాషిస్తాడు, అటుపై మహిమభట్టు కుంతకుడు, క్షేమేంద్రుడు ఉపన్యసి స్తారు. అప్పడప్పయ దీక్షితులు లేచి వీరంతా వారి వారి సిద్ధాంతాలను సమ ర్థించుకొంటూ వారి మతాన్ననుసరించే ఈ కావ్యం వ్రాయబడిందంటూ పేచీ పూచీలు పడుటను నిరసించి, ఆంధ్రిత్వము-ఆంధ్రిభాష దక్కడమే ఈకవి ధన్యత్వమంటాడు.

అపుడు చిలుక ప్రతివారూ వారి వారి సిద్ధాంతాలకు అనుగుణంగా ఈకావ్యం ఉందన్నారు గనుక సకల గుణోపేతమై నిజంగా కళాఖండగా మిగిలిందని నిర్ణయించి, సత్యనారాయణ శాస్త్రికి లభించిన సన్మాన గౌరవా లను తెలియజేయమని గోదావరీమాతను కోరుతుంది, గోదావరి వివరించాక అయ్యాయి కవి పండితులను సత్కరిస్తుంది సదస్యులందరూ కవిని ఆశీర్వ దిస్తూ మంగళ వాక్యాలు పలుకుతారు. సభ పరిసమాప్తమవుతుంది.



# అలంకారావలోకనం

షష్ఠాశ్వాసము

పరమేష్ఠి సవికల్ప భావ స్థితుంజొచుఁ
బ్రణవమ్ము ముమ్మారు పలికినట్లు,
వాక్ప్రపంచామృత ప్రాణ శక్తి విరించి
యిల్లాలు వీణ మ్రోయించినట్లు,
వైకుంఠ సమ్మాన్య పాంచజన్యోద్భూత
నైగమార్థ పరార్థ్య నాదమట్లు,
కమల నాభుని పాద కమలమ్ము సేవించు
భార్గవీ కంకణ క్వణములట్లు
ప్రమథ నాథుని ఢమరుక ధ్వానమట్లు
సర్వ మంగళా కింకిణీ స్వనములట్లు
త్రిభువనమ్ములయందుఁ బ్రతిధ్వనింప
సత్య లోక సభా భేరి సందడించె। 1

నడకల బెడఁగుల నాట్య సంగతి నేర్పు
నొజ్జనమ్మునకంచ యూరకుండె
గాలి తాకునకె నాదాల ముంపిరి వోవుఁ
గచ్ఛపి మౌన రాగాల మిగిలె
వదనాబ్జమున వ్రాలు భ్రమరాల విదలించు
భారతీ కంకణ క్వణనమాగె
నాల్గు మోముల వాని నయనాష్టకంబొక్క-
డెసఁ గౌతుకమునఁ గేంద్రీకరించె
చేతనాచేతనాత్మక సృష్టి యెల్ల
బ్రహ్మ నిష్ఠమైనట్లుగాఁ బరవశించి
మౌన ముద్రిత భావ సంపదలు గొనియె
సత్యలోకాన సాహితీ సభఁ దలిర్పు। 2

శ్రుతి కల్ప శాఖికా స్థితికి నెవ్వని ముఖ
పంక్తియే యొక యాఁవాలమయ్యె
కలలు లేకయె కోటి శిల్ప సృష్టినిఁ జేసి
ప్రాణముల్ వోయునెవ్వాని కరము
నుదిటి వ్రాతలు వ్రాసి, బ్రదుకు మార్గము సూపు
నెవ్వానికై నిత్య కృత్యమాయె
కమల నాభుని నాభి కమలమే సదనమై
యీ ప్రపంచమ్ము సృష్టించునెవఁడు
నిక్కపుం జగమేలి పెంపెక్కునెవఁడు
వీరు మేతరి యెవ్వాని ముద్దు పట్టి
వేని యుదరము మెలి కడాని గనియొ
యట్టి శతధృతి యొకచోటనధివసించె।

పదిరెండు పేర్లతోఁ బరఁగి, బాసలకెల్ల
నాధిపత్యమ్మునే యతివ గాంచుఁ
దెలితమ్మి గద్దెపై నిలిచి, వల్లకిఁ బట్టి
మధుర గీతమ్ములే మగువ వినుచు
అంచపై తిరుగాడి, యఖిల లోకస్థుల
తలల వాకిళ్లనే నెలఁత నిలుచు
సంగీత సాహిత్య సదనమ్ములై నట్టి
పాలిండ్ల బరువునే పడఁతి దాల్చుఁ
గళల కాణాచి యౌచునే కలికి మెలఁగు
నబ్జ శుక పుస్తకమ్ములు నక్షమాలఁ
బూని నలుకేలఁ దాల్చెడి చాన యెవతె
అబ్జ యోని ప్రక్కనె యామె యధివసించె।

తలిరాకు బోడి దొర వి
చ్చలు మోసెడి వారువమ్ము, సాహిత్యముపై
కలిగిన రక్తిమ యేమో
యలవోకఁగ నెఱప వచ్చెనాధ్యక్ష్యమ్మున్। 5

పాల కడలి పైఁ బవ్వళించెడి వాఁడు
తల్లి తల్లినెదను దాల్చు వాఁడు
భోగి తల్పమైన భోగి, మామకు మామ
విష్టర శ్రవసుఁడు విడిది సేసె। 6

తమ్మి యింటి గరిత, తారా పతికిఁ దోడఁ
బుట్టువబ్ధి జాత, పట్టి గీముఁ
జేరి యందు సభల తీరుఁ దెన్నులు చూడఁ
దల్లి తల్లి మగని దరిని నిలచె। 7

పదములనంటి, భక్తి భర భావ మెడందను సందడించు సం
పదలను దోఁగి, యున్నమిత మౌళి చతుష్క చిరత్న రత్న దో
హద రుచి కోటి భాసిత పదాబ్జుఁ జేసి, రమేశుఁ దత్కృపన్
గదిసెను భారతీ విభుఁడు గాఢ తపో విభవాభిరాముఁడై। 8

జడ దెసనేలు వాఁడునలికమ్మునఁ గంటిని నిల్పి నిచ్చలున్
కడ ముడి జంగమై, కటిఁ జర్మము గట్టుచుఁ బాఁప సంతతుల్
తొడవులు కాఁగ జూటమును దోయజ వైరి గృహమ్ము సేయునా
యొడయఁడు, గృత్తివాసుఁడు మహోర్జితశక్తుఁడు వచ్చె రక్తిమై। 9

ఏనిక మోము తోడ మఱిపించెడి బొజ్జకు మోదకమ్ములె
న్నేనియుఁ బెట్టి, శీతకరుఁడియ్యది చూడ గ్రహించి. దృష్టి దో
షానకు భీతిఁ జెంది, వడిఁ జందిరి ధరాలిక భూతినుంచునీ
శానియుఁ గోరివచ్చి, పతి సన్నిధి నిల్చె సపుత్రయై సభన్। 10

పుట్ట పట్టి తోడ ముసు గల్గుఁ గవులెల్ల
మున్నె వచ్చినారు వెన్ను నంటి
యాంధ్ర కవులు కూడనరుదెంచిరందందు
నధివసించినారలాసనముల। 11

కాత్యాయనుఁడు పాద కమలమ్ములను శిష్య
వృత్తి సందర్శించి వేడ్కఁ గొలువ,
ముని పతంజలి పల్కు మొల్కలం జిగురొత్తఁ
బోషించి వల్కలంబుల ఘటింప
శ్రీజయాదిత్యుండు, శ్రీవామనుండును
జెటియొక ఛత్రమ్ము చెలువు సేయ
గార్గ్య భారద్వాజ కాశ్యప శాకల్య
చాక్రివర్మణ రౌధి శాబ్దికులును
జయ జయాతుఘోషలు సేయ, శాకటాయ
నాదులు తమంత సందడినరుఁగుఁ దేర
శబ్ద దర్పణ భావ రాజచ్ఛరీరుఁ
డక్షర సదస్సు 'పాణిని' యడుఁగు పెట్టె। 12

భామహాందర్ఘ్యమ్ము పాద్యమ్ము నర్పించి
    తానగ్ర భూషయై దారి చూప,
వామనుండొక వంక వ్యజనమ్ము చేఁబట్టి
    యుపచార రీతులకొజ్జ కాఁగ
కుంతకుండును వాని చెంతనే యుపచార
    వక్రితల్ రానీక వఱలుచుండ
జయ జయ ధ్వనులఁ బ్రస్తావించి యానంద
    వర్ధనుండును దోడఁ బదము వెట్ట
రసము చిప్పిలునట్లు స్తోత్రముల తోడ
వెనుకఁ బండిత రాయలు వినుతి సేయ
శాంత గంభీర దివ్య వర్చస్వి యగుచుఁ
బదమునుంచెను సభ యందు భరత మౌని, 13

పలుకుఁ బూఁబోడి ముంజేతి చిలుక యప్పు
డధివసించినదశరాధ్యక్ష పీఠి
నలువకాతవి చెలువకు నతులొనర్చి,
సభకు నతిఁజేసి, చేసెఁ బ్రిసంగమిట్లు। 14

కవితా కర్షకులై, చరింపఁ గల సంఖ్యావంతులెవ్వేళలన్
వ్యవసాయమ్మొనరింపఁ దత్ఫలిత దివ్యచ్ఛక్తినాహా। రసో
ద్భవ సంపద్విభవాభిరామ భరమై భ్రాజిల్లుఁ బ్రాపంచికో
త్సవ సంరంభము గొంత కన్న జనికిన్ సాఫల్యమున్ జూతుమే। 15

జగతిన్ శబ్దము బ్రహ్మమై. సగుణమై సాకల్యమై సత్పథ
ప్రవణంబై. బహు భద్రమైనయెడఁ గావ్యత్వమ్మునార్జించినన్
శివ సంధాయకమౌట తథ్యము. రసశ్రీ వార్ధిలో మున్గు గౌ
రవమే గౌరవమౌచు. శాశ్వతము. కల్యాణ ప్రదంబయ్యెడిన్। 16

దేశ భాషలయందుఁ దెలుఁగు భాష
లెస్స యని పల్కెఁ గాదె శ్రీకృష్ణరాయ
విభుఁడు నేఁగూడనేకీభవించుచుంటి
నందుఁ బలుకుల విందు పసందు నాకు। 17

మధునాపంతుల వంశాం
బుధి యందున రేవెలుంగు పొడమెను గవితాం
బుధి యందీదుట పరమా
వధియేమోః పలికెనేవిఁ బద్యమువలుకున్। 18

అట్టి సత్కవి సత్య నారాయణుండు
వ్రాసి యున్నట్టి యాంధ్ర పురాణ కావ్య
రాజమును గూర్చి వినెడు తలంపు కలిగి
తలపు బండింపమంటి విధాతృ సతివి। 19

పొత్తము ముత్తో తత్కవి
మొత్తము జీవితము దెలిపి, పొత్తమ్మున మేలో
పుత్తడి తొడవులఁ జూపఁగ
విత్తటి సభనేల్పరింపనిచ్చినదానన్। 20

ఇంతకు మున్ను సంస్కృత కవీశులునాంధ్రి కవీశులున్ గృతిన్
వింతలు సూపినారు, రస వృష్టినెసంగఁగ ద్రాక్షఁ గ్రొత్తలా
పుంతలు సూపినారు, నృప పూజ్య కథా కధనమ్మునందు వా
క్కాంతులు సూపినారు, సుడికారములన్ నయగారమెంచుచున్।    21

ఆ రమణీయ రూపయగు నాంధ్రి పురాణ లతాంగి, యే యలం
కారములన్ ధరించి, తన కాంతులు వానికి పంచి యిచ్చి, సిం
గారము రూపు దిద్దుకొను గాథ మనోజ్ఞతనంది యున్నదో
మీరలు చూచినారలది మేము గ్రహింతుము చెప్పుడీ బుధుల్।    22

ఆ లలితాంగి రూపమరయన్, ముఖ పద్మ మరంద ధారలన్
గ్రోల, నిరంతరమ్ము, నను కూరిమితో వలపించి, మించి, ప
ద్యాలను జేసికో దగిన భాగ్యము దక్కిన యట్టి జంట ము
క్కాలి కాలమ్ములోఁ బ్రథమ గణ్యుఁడు మా భరతుండు గావలెన్।    23

న్యాయ శాస్త్రవై, చరణ విన్యాస పటిమ
నెంచి, మించిన వాఁడవై, దృశ్య కావ్య
విధి విధానము నెఱిగించు విబుధ వర్య।
పలుకుమాంధ్ర పురాణ కావ్యమ్మునెంచి।    24

అని కీరమ్మాదేశిం
చిన తఱి భరతుండు లేచి, శీర్షము వంకిం
చిన వాఁడై నతి సేయుచుఁ
దెనుఁగుం గృతినెంచి, పలుకు తేనెలు చిల్కన్।    25

జాలా। యాంధ్ర పురాణ కావ్యమును వహ్వాయంచు బ్రహ్మణియున్
గీరమ్మున్ నుతి సేయ, శిష్ట కవితా క్రీడా పరుల్ స్తోత్రి సం
భారమ్ముల్ పొనరింపఁ గానదియపో భాగ్యమ్ము కావ్య ప్రపం
చారామోద్భవ పారిజాతమ ఁగఁ గావ్యమ్మందె సౌభాగ్యమున్। 26

శ్రవ్య కావ్యమ్మ యయ్యు శిల్పమ్మునందు
నాటకీయతఁ జొప్పించి నడపి యుంట
దృశ్య కావ్యానుభూతినందింపఁ గలిఁగె
నింతకంటెను వైదగ్ధ్యమేమి గలదు। 27

"మానవుని జీవితమ్మ మేలైన కబ్బ
మందు సత్కవి యేరిన బిందువొకటి
యొక మహా కావ్యమా" నన్న సుకవి పలుకు
కావ్యతా సిద్ధికే యలంకారమాయె। 28

కరుణ వీర రసములరుదైన తీరుగాఁ
జాలు వారఁ జేసి, శాంత రసము
నంగి రసము చేసి యలవోకగాఁ గృతిన్
దీర్చి, దిద్దినట్టి దిట్ట యితఁడు। 29

కాని యొకండు కోర్కి మొలకల్ తల సూపెడి దృశ్య కావ్య రూ
పానకుఁ దెచ్చి యీ కృతిని భవ్య మతుల్ రచియింతురేని, లో
కానకు మేలు కల్గు, మహి కాంతుల సచ్చరితల్ పఠించి, వి
జ్ఞాని యెఱుంగుఁ బామరులు గాంచిన గాని గ్రహింప నేర్తురే। 30

ఈ నా కోరిక తీరిన
నానందమపారమయిన యబ్ధియ యగు, వి
జ్ఞానుల యందెవరేనియుఁ
బూనుడి కర్జమ్ముమంచు బోధింతు సభన్। 31

అమలోదాత్తము కావ్యమీ జగతి దీవ్యత్ కావ్య భాషా సము
ద్రమునన్ రత్నము కాఁగ వెల్గుచుఁ జిరత్నంబైన యానంద లో
కమునందున్ విహరింపఁ జేయఁదగుఁ బ్రజ్ఞా శాలియై యిట్టి పా
త్రము వ్రాయం గలిగెన్ గవీశ్వరుఁడు తాదాత్మ్య స్థిత ప్రజ్ఞుఁడై। 32

అతనికి నారోగ్యమ్మును
శతమానంబాయువిచ్చి, సతతము సత్య
వ్రతుఁడై, యేతాదృశ స
త్కృతులెన్నియొఁ బలుక బ్రోహిమ్మ కీర్తిగంటఁ గనున్। 33

అని భరతుఁడు కావ్య సమీ
క్షను జేసియు, సూచనమ్ము గావించియు, దీ
వెనలిచ్చుట కీరమునకు
మనమున సంతసము మిగుల మన్నన సేసెన్। 34

అమెయి భరతుండొసఁగిన
యామెతలను స్వీకరించి, యానందముతో
ధీమతియై తా నిలిచెను
భామహుఁడు మహామహుండు పలుకాడుటకై। 35

సల్లలితాంగినాఁ దగిన చేనయు భూషణముల్ త్యజించి శో
భిల్లదు. కాన యెంత రస వృష్టి సమృద్ధిగఁ జూపుఁ గాక. తా
నల్లిననాఁడలంకృతులనందము చిందుచుఁ గావ్య కన్య యు
త్ఫుల్ల సరోజ నేత్ర వలపుల్ ప్రచరించు రహింప లోకముల్। 36

ఈతఁడలంకారమ్ముల
కైతను వేవేలు నిలిపి, కలకండలహో
పోతలు పోసి యెదంతల
లోతులనే త్రివ్వెఁగగవన లోకము తనదై। 37

"కారడవి పండు వెన్నెల
కౌరాదీ నిబ్బరంపు కబ్బమ్మ"నున
య్యారే! యుపమాలాంకృత
ధీకుండితగాఁడు కవన దీక్షా మతియున్। 38

ఉపమోత్ప్రేక్షాలంకృతు
లపురానీతములు కైతయను విడెమునకున్
గపురంబుం బలుకులుగా
నపూర్వమై చెలఁగు వింత యనుభూతినిడెన్। 39

అని భామహుఁడును దన యా
సనమునఁ గూర్చుండ దండి సలలిత పద గుం
ఫన మతి, కావ్యాదర్శం
బును బలికిన జాణ పలుకఁ బూనెన్ పిదపన్। 40

102

భామహుండిండుఁ దాఁ బలుకఁ బల్కులు వింటిని, నవ్వుకొంటి, వ
హ్వా! మగువల్ విభూషణములందిన సుందరులౌదురన్నచో
మా మతమందుఁ జెల్లదు సుమా! గుణ గణ్యయు సుందరాంగి, యా
రామమునందగండిలములన్ సుమ కోటుల మెత్తురే జనుల్। 41

ముదిత గుణ హీనయై కాదు మోహనాంగి
దశ గుణమ్ములు లేక కైతయును గాదు
దోష యుక్తయౌ కాంత పొందునకుఁ దగదు
దోష దశకమ్ముగొనుఁ గైత తూగఁ బోదు। 42

ఆంధ్ర రాజ చరిత్రముల్ వ్యాకరించుఁ
గావ్య మందున దోషముల్ గానఁ బడవు
కనుక గుణవతి యైన యీ కైత కన్నె
పైఁ జెలఁగు నీడలను విశ్వమ్ము వెలఁగు। 43

ఊగెన్ సమస్త లాలనమునందోజొ గుణ వ్యాపృతిన్
సాగెన్ దత్పదమున్ బ్రసాద రుచి నై జమ్మై సమాధిష్ఠమై
తూగెన్ దా సమ తత్త్వ మాధురులు విందుల్ సేసి యాశ్లేష వి
ద్యా గాంభీర్యము, సౌకుమార్యముల చిందన్ గైత కాంతాకృతిన్। 44

ఇన్ని గుణములన్ లీలఁ గైకొన్న యట్టి
భవ్య పరి పూతయైన కబ్బంపుఁ బడఁతి
యే యలంకారములను ధరించు కొనెనో,
లేదా! మాకేల దీనికి లేదు సాటి। 45

అనుచు వచియించి దండి తానధివసింప
భారతీ దేవి ముంజేతి కీరమపుడు
చేయుఁ గను సన్నగాంచి, తా సిద్ధపడియెఁ
బలుకులఁ దిగ్విజయమ్ముఁదైన వానునుండు। 46

చెల్లునెదేని సద్గుణాశ్లిష్టయైన
పద రచన 'రీతి' యను పేర, భవ్యమైన
కావ్యమునకాత్మ రీతియే గనుకఁ గృతుల
సాగు వైదర్భి. గౌడి, పాంచాలులందు। 47

మృదువగునర్థమ్ములతోఁ
బద రచనము సాగునేని 'వైదర్భి' యగున్
అది యీతని కావ్యమ్మున
నది వలె ప్రవహించి, నర్తనమ్మొనరించెన్। 48

యజ్ఞ పశువుగఁ జేసి నాకర్పణముగఁ
బుత్రునిమ్మని వరుణుండు పోరు నాఁడు
రోహితుని తండ్రి మిషలతోఁ ద్రోసి పుచ్చు
వేళ వైదర్భి కబ్బాన విడిది నేసె। 49

ప్రౌఢ భావమ్ము వర్ణించుఁ బలుకులందు
ప్రౌఢిఁ జూపఁగ 'గౌఢి'యై పరిఢవిల్లు
కావ్యమందునననుయాయి కథలయందు
వలయుఁ దావులదధిగూడ పదను గొనియె। 50

గౌడ డిండిమ శ్రీనాథ ఘనులు కూడి
వాగ్వివాదము సలిపెడి పైనమందు
నదియుఁ జూపట్టెనొక్కింత యందునందు
వ్యస్తమందున గాడి కన్పడుట వింత। 51

ప్రౌఢిఁ జూపించుచున్, మార్దవమ్ము గూడఁ
జూపఁ బాంచాలినాఁ జెల్లు, సుకవి కైత
యెన్ని తావులనేనిఁ గైకొన్నదిదియు
యున్నవింతుగఁ బద్యమ్ములెన్నియేని। 52

కవి గుణాఢ్యుని పైశాచికంపు కృతిని
వీతిహోత్రుని పాల్జేయు వేళ యందు
నడుగునడుగునఁ బాంచాలి నడువ సాఁగెఁ
గృష్ణ రాయలతోఁ గూడఁ గ్రీడ సలిపె। 53

ఈ రీతిని రీతిని వి
స్తారమ్ముగ నిలిపినట్టి సత్కృతి యొటన్
బారమ్మెరుఁగని యానం
దాళామ పరిమళమ్ములాకసమంటెన్। 54

అనుచు పచియించి వామనుఁడుదివసింప
భాష యందున రుద్రుఁడై పరిఢవిల్లు
రుద్రటుండు లేచి విజ్ఞాన ముద్రితుండు
పలుకఁ బొచ్చెను సత్య నభా స్థలాన। 55

భామహుని పల్కు నేఁ గూడఁ బల్కుచుంటిఁ
గబ్బమునకలంకారముల్ కాంతులొసఁగు
నందు వాస్తవౌపమ్యమ్ములతిశయమ్ము
శ్లేష యను నాలుగింటనే చేరునన్ని। 56

శ్లేష యొక్కటి దక్క వాగ్యోష యిందు
మొదటి మూటిని ధరియించి, మురిసి పోయె
కనుక మా మతమ్మునకె యీ కైత తూఁగు
రక్తి నానంద డోల చిత్రముగనూఁగు। 57

అనుచు రుద్రటుండును బల్క యధివసింప
భట్ట లోల్లటుండును లేచి పలుకఁ దొడఁగె
రసము లేనట్టి కావ్యమ్ము రమ్యమగునె?
ప్రాణమన్నది కృతులకు రసము నిజము। 58

సుకవి వ్రాసిన పొత్తమ్ము సూక్ష్మ మతుల
చిత్తమెలయించదే రసోత్పత్తి చేత
నిందు రసముత్పత్తిల్లినదిందునందు
ననఁగనేలకునాద్యంతమటులె సాఁగె। 59

అనఁగ భట్ట నాయకుఁడు పల్కఁ దొడఁగె
రసములుత్పత్తి యగుట చిత్రముగఁ దోఁచెఁ
బుట్టునట్టిది కాదది భుక్తమగును
పాఠకులచేత భుక్తమై పరిఢవిల్లు। 60

ఇందునాస్వాద యోగ్యమై యింపు నింపె
రసము, డెందముల్ సొక్క నిరంజనముగ
ననుచుఁ బల్కాడి తాఁగూడనధివసింప
శంతుకుఁడు లేచి యొక్క యాశంకఁ జేసె।

61

కావ్య రసమొక దృశ్యమా। కాని నాఁడు
తినుట యను మాట యెట్లు తోచినది మీకు
నందుననుమితియే రసమౌను గాని
భుక్తి యన్నది సుంతయుఁ బొసఁగఁ బోదు।

62

అనఁగ నభినవగుప్తుండునందుకొనియె
యద్ది సహృదయాభివ్యజ్యమగును గాని
పుట్టుటయు లేదు, తినుటయు మున్నెయుండ
దున్న రసమునకనుమానమన్న లేదు।

63

అనుచుఁ బలుకాడి తాఁ గూడనధివసింపఁ
గోరి యానంద వర్ధను కొలుకుఁ జూచెఁ
జిలుక, పండిత రాయలు నిలిచె, వాని
పలుకులను గూడ నేఁ బల్కఁ గలనటంచు।

64

ఆనంద వర్ధనుని మత
మానందమునిచ్చు మాటసంగీకృతమై
నేనందును రసమంచును
దానను ధ్వనియంచు, రసము ధ్వనియింపదొకో।

65

కనుకనితుపురి మతములొక్కటనె కలియు
నదియు రూపింతునితని కావ్యమ్మునందు
"మావి చిగురంత యేనియు మంట రాదు
వచ్చునో పాచకుల కంటి వాన వచ్చు"॥ 66

అన్న పల్కుల ధూమమే యరుఁగుఁ దెంచి
యింట నిండినదంచు ధ్వనించుచుండె
మావి చిగురంటచేఁ జైత్ర మాసమయ్యె
విభుఁడు దాఁగెనటంచు ధ్వనించుచుండె॥ 67

విందాన్నదాత యగునా
ధరణీ పతి యెంత దుఃఖ తత్పరుఁడగునో
యరయం జెల్లదె యదియే
కరుణంబొచును ధ్వనించుఁగాదే కృతినిన్॥ 68

ఎన్నియొ కావ్యమందుఁ గలవిట్టి విశేషములార్ష ధర్మ సం
పన్నుఁడు కావ్యమందు రస వైభవముల్ ధ్వనియింపఁ జేయు వి
ద్వన్నయశాలి, శాస్త్ర గుణ పాటవముల్ ప్రచురించుచున్ విరా
పన్నుఁడుగాఁ జెలంగి, యిటువంటివి పెక్కులుగా రచించుతన్। 69

అనుమ పండిత రాయలునధివసింప
మహిమ భట్టు వచించె సమ్మతినిఁ గొనుచుఁ
బాఠకునకనుమానమై ధ్వని స్ఫురించు
నొట ధ్వని యనుమాన గతార్థమగును। 70

అనుమానింపఁగ వచ్చునీ కృతిని, వ్యాప్త్యాలింగ లింగ్యాదికం
బనుమేయంబు, రసప్రతీతి కృతినధ్యక్షించె, శబ్దార్థ సా
ధన వాణీ కరుణాద్భుతున్నతికిదే తాత్పర్యమన్వించు. భా
వ నిధి వ్యక్తి వివేక వైభవము సంవర్ణింతునాశీస్సులన్। 71

అనుచుఁ బల్కాఁడి భట్టు తానధిగమింపఁ
గుంతకుఁడు లేచె శాస్త్రార్థ కోవిదుండు
ఉక్తి వైచిత్రి చెల్లు వక్రోక్తి యనఁగ
నది చమత్కృతి. కృతులకుం బ్రాణమదియ। 72

వచన వక్రతయును లింగ వక్రతయును
ప్రకరణోపచారముల వక్రతలు కలిగి
అది చమత్కృతిమత్కృతియైన కృతిగ
ధరణి యందున శాశ్వతత్వమ్ము గొనును। 73

కవి వక్రోక్తికి లక్ష్యమీ రచన, యోఁగాములే కథా వక్రతా
కవితా వక్రతలందు వర్ణ పద వక్రత్వమ్ములాశ్వాస వ
క్ర వచః ప్రౌఢియు ఘోష పెట్టెడిని. యాంధ్రాధీశ పౌరాణికం
బవురా వక్రతకింటి పట్టు, కవితా హర్మ్యంపు శిల్పంబులన్। 74

ఎంచనుదయ పర్వంబున నెత్తికోలు
చక్కని ప్రబంధ వక్రతకిక్క యగును
"తనువు నెడి యాకు రాల్చిన తెనుఁగు తోట"
పలుకు ప్రకరణ వక్రతఁ జిలుకరించె। 75

అనుచు వచియించి కుంతకుండదివసింపఁ
జిలుక యానతినెంచి, యౌదలను దాల్చి
పలుకనౌచిత్యమెఱిఁగి శ్రోతలకు విందు
లెసఁగఁ జేయఁగ లేచె క్షేమేంద్రుఁడపుడు। 76

రసమున్నను ధ్వని యున్నను
బస గలిగిన రీతులున్న, వక్రత యున్నన్
వెసనెన్ని గుణములున్నను
నసదే యౌచిత్యమొకటి యగుపడకున్నన్। 77

పద వాక్యములలోఁ బ్రబంధార్థములయందు
గుణ రసమ్ముల విశేషణములందు
కారకాలంకార కాల దేశ నిపాత
సత్త్వ లింగ వచన తత్త్వములను
బ్రతిభా విచార స్వభావ నామావస్థ
లందునాశీస్సుల యందునేవి
వ్రత కులమ్ములనభిప్రాయమ్ములో సార
సంగ్రహమ్ములను నక్షత్ర సంఖ్య
వలయునౌచిత్యమద్దాని పటిమనెఱిఁగి
వ్రాయఁబడ్డది చెల్లుఁ గావ్యమ్మునాఁగ
రాణకెక్కినవాంధ్ర పురాణమందు
నిన్ని యౌచిత్యములు గాన వన్నెకెక్కె। 78

అనుచు క్షేమేంద్రుఁడును గూడనధివసింప
నప్పుడప్పయ దీక్షితుండనెడు ఘనుఁడు
లేచి, సభ్యులెల్లరి మోములఁ జూచి, పిదపఁ
బలుకఁ దొడఁగెను బలుకుల కలిమి వాఁడు। 79

ఎదియో పల్కరి పండితోత్తములు నేడిచ్చోటఁ జిత్రమ్ముగాఁ
బుపు తేనెల్ గ్రహియించుఁ దుమ్మెదలకాపూగుత్తి వర్ణమ్మనెం
చి, విచారింపఁగఁ గల్గునా? రసము వర్షించున్ గృతిన్ జూచి, శా
స్త్ర విశేషమ్ములనుగ్గడించుచు స్వసిద్ధాంతాల వాక్రుత్తురా। 80

ఆంధ్రుఁడౌటయునాపైనినాంధ్రి భాష
పట్టు వడుటయునల్ప తపమ్ము వలనఁ
గలుగునే! యది యతనికిఁ గలిగెఁ గాన
ధన్యుఁడాతఁడటంచు లోఁ దలఁతు నేను। 81

అంత మాత్రము పలికి తానధివసించెఁ
గీరమానందమను సుధాసారమందు
నేచితమ్మొచు, సుకృతమ్ము నోచినట్లు
లోఁ దలంచుచు నిలిపెనావాదములను। 82

భవ్య మతులార! మీరిందుఁ బలికినట్టి
పలుకులన్నియు వింటి, సంభ్రమము గొంటి
నిందు సిద్ధాంతములు సమర్థించు కొనుచు
వారి వారి మతమ్ములొప్పబెట్టెననిరి। 83

ధ్వనియో, కాక రసమ్మొ, రేక గుణమో వక్రోక్తియో, రీతియో
యనుమానమ్మొ యటంచునందొకటినే యార్జించుచున్ గైతలన్
గొనువాఁడే కవి యంచు నా మతము వాటిల్లిత్తున్ భళా కావ్యమం
దున సిద్ధాంతములన్నియున్ గలియుటన్ దూఁగెన్ గళా ఖండమై। 84

కవిని గూర్చి వింటిఁ, గవి రాజు కావ్యమ్ము
వింటినతఁడు గాంచు బిరుదములను
గొన్న సత్కృతులను గోదావరీమాత
పలుకునంచుఁ జిలుక పలికెనంత॥ 85

వేదము వలె ఘోషించెడి
గోదావరి లేచి, కవి యశోభింతుఁడగుచున్
సాధించిన సత్కృతులను
మోదముతోఁ బలుకఁ దొడగెఁ బులకాంకితయై॥ 86

ఆంధ్ర విశ్వ విద్యాలయంబతనినెంచి,
నిర్ణయించినది 'కళాప్రపూర్ణుఁ'డంచు
'ఆంధ్ర కల్యాణ' బిరుదమ్మునందినాఁడు
వరలు సాహితీ సమ్రాట్టు పదవినంది॥ 87

సర్వ భాషా కవి సమ్మేళనమున స
మ్మానమ్ము గొనె రాజధానియందు
పలు రాష్ట్రములయందుఁ బలుకు పలుకునఁ బద్య
ములు చెప్పి సత్కారములను గాంచె

విజయ నగరమందు 'విజయభావన' యను
ఘనమైన సత్కారమును గ్రహించె
కాంచన రుద్రాక్ష కంఠహారము వోల
వరమిచ్చి, యాతనిఁ బ్రస్తుతించె
అతని పుట్టుకచే ధన్య యైనయట్టి
పల్లెపాలెమప్పన వెట్టి పైడి దండ
సర్వ దేశాంధ్ర సభల యుత్సవములందు
నతని వలనన గౌరవంబాంధ్రికబ్బె॥ 88

అతఁడావిష్కరించినాఁడాది కవిని
భాగ్యనగరమ్ములో 'టాంకు బండు' పైని
భారత వ్యాఖ్య-నన్నయ వ్యాస పీఠి
అతని సంపాదకత్వమ్మునందు వెలిగెఁ॥ 89

మధు కోశము 'సంచికతో'
సుధునాపంతుల కవిత్వ మధురిమలెంచున్
విధి "రాజ మహేంద్రి" భళా
సుధలొలికెడి యిందిరి సభకసూయ మిగిల్చెన్॥ 90

కైతలను మెచ్చుకొన్నవకాడమీలు
తడవ తడవకుఁ బలు ప్రభుత్వములు మెచ్చె
ఎన్ని పీఠమ్ములో సత్కరించు కొనియె
పౌర జన సత్కృతులను జెప్పంగఁ దరమె?॥ 91

త్రిపుర సుందరీ చరణ ప్రదీప్త భక్తి
భావ కూలాంకషాతి ప్రవాహ గమ్య
మాన శివ శివా చైతన్య మధు సముద్రి
లక్ష్మినెదనించు 'లక్కవరమ్ము'నందు 92

వెను వెంటన్ బ్రిజ. వాద్య కోవిద జనుల్, విద్వాంసులున్ సత్కవుల్
చనుదేరన్ బర దేవతా చరణ సాక్షాత్కార భావాగమా
నన తేజః పరిపూర్ణుఁడెన 'త్రిపుతానందర్షి' వేదాక్షర
స్వన విన్యాస మధు ప్రమోదముల సవర్షించి హర్షింపఁగన్॥ 93

జరిగెఁ గనకాభిషేకమ్ము సర్వ జనము
కిటకిటలనాడె నాటి సత్కృతినిఁ గాంచ
జనికి సాఫల్యమంచు ముచ్చటలు పడుచు
సత్యనారాయణ కవి దర్శనము కొఱకు॥ 94

కనకాభిషేకమా! హృద
యనమః కనకాభిషేకమా! ప్రేమాశీః
కనకాభిషేకమా! యిది
యన జనసంతంతమెప్పెనార్ద్రాశీకమై॥ 95

ఆతని కవన ధారను జూచి యప్పుడపుడు
పొంగి పొర్లుచునుందు సమ్మదము తోడఁ
జూడఁ గన్నెఱ్ఱ కల్గునసూయ తోఁత
విడియమునఁ జిక్కుచుందును బెంగతోడ॥ 96

రసమునకన్నను గవితా
రసమే నిశ్చలము సుకవి రాజన్యుఁడు తా
పసియై చేసిన కృషిచే
మసలును నా మనము తాను మసలెడు చోటన్॥ 97

అతని గాత్రమ్ము సోక ధన్యత్వమబ్బె
అతని కవనమ్ము వింట ధన్యత్వమబ్బె
కొన్ని గాంచితిఁ, బ్రజలు వాకొనిరి కొన్ని
యందుఁ గొన్నింటిఁ జెప్ప భాగ్యమ్ము గొనితి 98

అనుచున్ గోదావరి కూ
ర్చొనినది సభ యెల్లనపుడు శుకముఖమును జూ
చినది, సెబాసనుచును, మె
చ్చిన తీరాపగలుఁ దెలియుఁ జిలుకకుఁ దెలియున్॥ 99

శతధా క్లుప్త, సహస్రధా వివృత అక్షైనేకళః కోటి శ
స్తత భావ ప్రథితమ్ముగా నడమఁ బద్య స్ఫార రథ్యా గతిన్
బ్రతిభా వృష్టియ కావ్య రూపమునను త్పన్నంబుగా వాణికా
రతి పాత్రంబననోపునిక్కవి వరున్ రక్షించుతన్ దేవతల్। 100

అని చిల్క పల్కఁగా నద్దాని గెంగేల
 ధరియించు వాణి శుభమ్ము పలికె
నాపెకు నలు మోములధివాసముగఁ జేయు
 బరమేష్ఠి కూడ శుభమ్ము పలికె
కమల యోనికి జన్మ కారణంబైనట్టి
 పద్మ నాభుఁడును శుభమ్ము పలికె
వెన్నునురస్సీమ విడిదిగాఁ జెలువొందు
 వార్ధి సంజాత శుభమ్ము పలికె

సిరికిఁ దోడఁ బుట్టిన యట్టి శీత కరుఁడు
వానినౌదలఁ దాల్చెడు పరమ శివుఁడు
వాని సామేన నిల్చెఁ బర్వత తనూజ
పలికిరోలినిఁ గవికి శుభమ్మటంచు। 101

పార్వతీ దేవి ముద్దుల పట్టియైన
వాఁడు వెనకయ్య మున్నె శుభమ్ము వలికె
యాతనికి సోదరుండు షాణ్మాతురుండు
పలుకు గనియైన కవికి శుభమ్ము వలికె। 102

అతని పదములు నాకు నాట్యమును నేర్పెఁ
గాన వానికిఁ గలుగు సౌఖ్యమ్మటంచుఁ
గార్తికేయు భరించి, లోకములు తిరుఁగు
వాహనమ్ము కలాపి శుభమ్ము వలికె। 103

శివుని గళ సీమ నిల్చిన చిలువ ఱేఁడు
జాతి వైరమ్ము మఱచి యా సత్య సభను
శుభము వలుకుఁ గలాపితో శ్రుతినిఁ గలిపి
యెడఁద సాక్షిగనేకీభవించినాఁడు। 104

చిలువకోఁగిరంబిడు గాడ్పు కలుగుఁ గాత
మతనికాయువు నూతేఁడులంచుఁ బలికె
గాడ్పు చెలికాఁడు వలికెఁ దత్కవికిఁ గలుగుఁ
గాత చైతన్యమంచు వాక్కాంతులెలయు। 105

అగ్ని గర్భమ్మునం గల యబ్ధి గూడ
సడలనీనిఁక గాంభీర్య శక్తి కవికి
జీవనమునందు, గైతలన్ సృష్టి చేయు
శిల్పమందుననంచు వచించినాఁడు! 106

కడలి నెచ్చెలులను దరంగముల కరము
లెత్తి దీవించె, ధారయందింతకింత
వేగమబ్బును గాత కవిత్వమందు
నిట్టి కృతులెన్నియేని లిఖించునంచు। 107

ప్రకృతి యంతయు దీవించెఁ బరవశించె
వాని దీవించుటే గొప్ప భాగ్యమనుచు
చారితార్థ్యమటంచు, యశమ్మటంచు
నెడఁదఁ దలపోసి, మురిసిపోయినది నిజము। 108

కవియె పృథ్వికి నిజమైన కలిమి బలిమి
ధాతృ సృష్టికి ప్రాతినిధ్యమ్ము దాల్చు
నేత యాతఁడు, విశ్వ విజేత యతఁడ
టంచు దేవతలే విశ్వసించినారు। 109

సభకై వచ్చిన సత్కవీశ్వరులు, శాస్త్ర ద్రష్టలున్, బౌంధిలీ
విభవమ్మున్ బ్రకటించి, సత్య సభలో వేవెల్గులై, బ్రహ్మ స
న్నిభులై, వీనుల విందులై యొసఁగు వాఙ్నిర్జర నిష్యంద సౌ
రభముల్ గుప్పిరహో! కృతజ్ఞతలు తెల్పం జాలనే మీకిటన్! 110

చాలదు; నల్పఁగా వలయు సత్కృతినొందు, చిరత్న రత్నముల్
పోలవు మీకు, మీ హృదయముల్ రతనమ్ములకుం గనుల్. స్తుతుల్
చాలవు వాక్ప్రసూనముల స్రష్టలు మీరు. పవిత్రమైన హా
రాల నొసంగెదన్, నలువ రాణి ధరించెడి యక్ష మాలలన్। 111

అనుచునక్షమాలలనిచ్చి యార్య జనుల
సత్కరించినదా చిల్క, సత్య సభకు
సభ్యులొటను దక్కెఁ బ్రసాదమనుచు
హారములు దాల్చి తేజస్వులైరి ఘనులు। 112

భరతుఁడు స్వస్తి వాక్యములు పల్కె బృహస్పతి తోడు గాఁగ ను
సర్వముల గీతికా చయము వాదన సేయఁగ సాగె భారతీ
కరమునయున్న వల్లకి, పికమ్ములు కోటి రహించి, పంచమ
స్వరములనాలపించినవి సత్య సభాస్థలి మాఱు మ్రోఁగఁగన్। 113

ఘన చయమ్ములు జయ జయ ధ్వనులు పలికె
పండు వెన్నెల హారతి పట్టె విధుఁడు
గంట మ్రోగించె గిరిశు శాశ్వరవరమ్ము
విరులు కొల్లలై మకరంద వృష్టి గురిసె। 114

నాల్గు వేదమ్ములొకమారు నలువ పలికె
పాంచజన్యమ్ము పూరించెఁ బద్మ నాభుఁ
డఖిల లోకమ్ములకు స్వస్తి యగునటంచు
నెల్లరును బల్క సభను ముగించినారు। 115

మధునాపంతుల జీవన
మధువులు చిందించునట్టి మధుజీవన కా
వ్యధునికినారవ పాయగ
విదిసాగె వరప్రసాదకృతి పూర్ణముగాన్‌। 1

అపురూపమ్ముగఁ బ్రేమను
త్రిపురానందుండు తీర్చిదిద్దుచు నాపై
గృపఁజూపించుటచే, ము
త్తైపుసరులారిటినిఁగూర్చితిన్ గర్వముగా। 2

భారతీ దేవిఁ బ్రావించుఁ బాలలోని
శక్తి, వేంకటరామయ్యశాస్త్రిప్రేమ
కృతిని వ్రాయించె, వారికినుతుఁడనగుట
నేనుజేసికొన్నట్టిపున్నెముల పంట। 3

ఉప్పులూరి వారా। రసాలూరు వారె
జానకీ దేవి, శ్రీరామ చంద్రశర్మ
పేరునకుఁ దగ్గ వ్యక్తిత్వ విభవమున్న
వారి యడుగు జాడయెనాకు బ్రిదుకు బాట। 4

జడ మతులు గారు శ్రుతులం
దుడుపతులే, యెదిరి నిల్చునగ్రుని తలపై
తడ బడక నిలుచు వారే
కడిమిల్లా' న్వయమునందు గవినొక్కఁడనే॥ 5

# సత్కారమాలిక

1966 : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు

1972 : పూనా ఆంధ్ర సంఘ సత్కారం

1975 : ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా సత్కారం

1975 : రాజమహేంద్రిలో ఘన సన్మానం, సన్మాన సంచిక: మధుకోశం, సాహితీ సమ్రాట్, ఆంధ్రకల్హాణ బిరుదు ప్రధానం

1980 : ఢిల్లీ జాతీయ కవి సమ్మేళనం

1980 : ఢిల్లీ ఆంధ్ర సంఘ సత్కారం

1982 : సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యత్వం

1982 : "బెజవాడ పట్టాభిరామిరెడ్డి" పురస్కారం

1982 : "కళాప్రపూర్ణ" ఆంధ్ర విశ్వకళాపరిషత్తు సత్కారం

1986 : నన్నయ వ్యాస పీఠం సంపాదకత్వం

1987 : టి. డి. డి. భారత వ్యాఖ్య సంపాదకత్వం

1988 : టాంక్‌బండ్‌పై నన్నయ విగ్రహావిష్కరణ

1988 : బెంగుళూరు దక్షిణాంధ్ర కవి సమ్మేళనం

1988 : విజయనగర "విజయభావన" ఘన సత్కారం

1988 : "వేటూరి ప్రభాకరశాస్త్రి" శతజయంత్యుత్సవ సత్కారం

1988 : రాజమహేంద్రిలో పౌర సన్మానం

1989 : తెన్నేటి వారి అవార్డు ప్రధానం

1989 : శ్రీ సుబ్బరామి రెడ్డి కళాపీఠం వారిచే సత్కారం

1989 : శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో, బూర్గులవారి అవార్డు ప్రదానం

1990 : రాజమహేంద్రిలో, "సప్తతి" మహోత్సవం

1990 : ఐ. పోలవరంలో సువర్ణ రుద్రాక్షమాల సత్కారం

1990 : "పల్లిపాలెంలో" అభిజనాభినందన సభలో సువర్ణ కంఠాభరణ సత్కారం

1991 : డా. సి. నా. రె. 60వ జన్మదినోత్సవ సత్కారం.

---

1991 సం॥లో

ఆంధ్ర కేసరి సెంటనరీ జూనియర్ కళాశాలలను
త్రిదండి రామానుజ చిన జియ్యర్ స్వామి సందర్శించిన సందర్భం-



1991 సం॥లో ఆంధ్ర కల్యాణ "మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు"
నివసిస్తున్న వీధికి వారి పేరు పెట్టిన సందర్భం-




ఆంధ్ర పురాణం రజతోత్సవం-శ్రీ జమ్మలమడక మాధవరాయశర్మ,
శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి. శ్రీ ఆర్. ఏకాంబరాచారి,
శ్రీ వేదుల శ్రీరామచంద్రకీర్తి. డా॥ చేబోలు శేషగిరిరావు.
సూచన; అన్నిఫోటోలలోని పేర్లు కుడినుండి ఎడమకు;




1987 సం॥లో ఆంధ్ర కేసరి యువజన సమితి రజతోత్సవంలో
శ్రీ కడిమిళ్ళ వరప్రసాద శతావధాని - శతావధానం చేస్తున్న సందర్భం-
శ్రీ రావూరి వెంకటేశ్వర్రావు, శ్రీ శతావధాని, శ్రీ వి.జి.కృష్ణమాచార్యులు
అభినవ నన్నయ మధునాపంతులవారు, శ్రీ ఆర్. ఏకాంబరాచారి.



**1987 సం॥లో**

శ్రీ వై. యన్. కళాశాల సాహితీ సదస్సులో శ్రీ మధునాపంతులవారితో
కళాప్రపూర్ణ పెద్దింటి సూర్యనారాయణ దీక్షితదాసుగారు
శ్రీ కె వెంకటాచారి, శ్రీ బిహెచ్. జినేంద్రనాధ్, శ్రీ డి. మోహనరావు,
డా॥ చినమిల్లి సత్యనారాయణరావు, శ్రీ రాపాక ఏకాంబరాచారి,
శ్రీ రౌతు సూర్యప్రకాశరావు, డా॥ ఎ. నారాయణరావు,
శ్రీ పి. బి ఎస్ మోహన్.



**1990 సం॥లో**

మధునాపంతులవారి స్వగ్రామం పల్లిపాలెంలో 'అభిజన అభినందన' సభ



1988 సం॥లో అక్షయ ఉగాదికి విజయ నగరంలో విజయభావన
మధునాపంతుల వారికి సన్మానం చేస్తున్న సందర్భంలో –
శ్రీ శర్మ రావు. (విజయనగరం కలెక్టరు) శ్రీ కూరెళ్ళ వేంకటశాస్త్రి.
శ్రీ పన్నంరాజు నాగేశ్వరరావు. శ్రీ వై. యస్. నరసింహరావు.



1990 సం॥లో
ఐ పోలవరంలో మధునాపంతులవారిని సన్మానిస్తున్న సందర్భం.

# ఆంధ్రకేసరి యువజన సమితి కార్యవర్గము.

| | |
|---|---|
| వ్యవస్థాపక కార్యదర్శి | : శ్రీ వై. యస్. నరసింహరావు |
| అధ్యక్షులు | : కుమారి కె. యశోద కుమారి |
| ఉపాధ్యక్షులు | : డా. పడాల రామ కృష్ణారెడ్డి |
| | డా. ఎం. బాబూరావు |
| | డా. శ్రీమతి. పి. నాగమణి |
| ప్రధాన కార్యదర్శి | : శ్రీ పెరుమాళ్ల రఘునాథ్ |
| సంఘటనా కార్యదర్శి | : డా. పి. వి. మురళీకృష్ణ |
| కార్యదర్శి | : శ్రీ డి. ఎస్. రాజేశ్వరరావు |
| టాలెంట్ టెస్ట్ ప్రాజెక్టు డైరెక్టర్ | : శ్రీ జె. వి. ఎస్. పి. పూర్ణానందరావు |
| పబ్లికేషన్ డివిజన్ డైరెక్టర్ | : డా॥ అరిపిరాల నారాయణరావు |
| కోశాధికారి | : శ్రీ. షేక్. అనదుల్లా అహమద్ |
| సభ్యులు | : శ్రీ. జమ్మి రామారావు |
| | శ్రీ. ఇమ్మంది శ్రీరాములు |
| | శ్రీ. ఎం. వి. చలపతి |

# ఆంధ్రకేసరి సెంటినరీ జూనియర్ కళాశాల పాలకవర్గండలి.

( ఆంధ్రకేసరి యువజన సమితిచే నడుపబడుతున్న సంస్థ )

| | |
|---|---|
| గౌరవాధ్యక్షులు | : శ్రీ దాట్ల బలరామరాజు, Ex.M.P |
| అధ్యక్షులు | : శ్రీ తమ్మన నరసింహరావు (జాలీ) |
| ఉపాధ్యక్షులు | : శ్రీ మద్దుల వాసుదేవమూర్తి |
| సెక్రటరీ & కరస్పాండెంట్ | : శ్రీ మైలవరపు సాంబశివరావు |
| జాయింట్ సెక్రటరీ | : శ్రీ గంధం నాగసుబ్రహ్మణ్యం |
| సభ్యులు | : శ్రీ పోతుల వీరభద్రరావు Ex. M L.A |
| సభ్యులు | : శ్రీ దొడ్డిపట్ల సత్తిరాజు |
| కోశాధికారి | : శ్రీ తొక్కుల రామాంజనేయులు |
| వ్యవస్థాపకులు, ఆంధ్ర కేసరి యువజన సమితి | : శ్రీ వై. ఎస్. నరసింహారావు |
| ప్రధాన కార్యదర్శి, ఆంధ్ర కేసరి యువజన సమితి | : శ్రీ పెరుమాళ్ళ రఘునాథ్ |
| సభ్యులు | : డా॥ వాసిరెడ్డి ప్రభాకరరావు |
| సభ్యులు | : శ్రీ శ్రీపాద జిత్ మోహన మిత్ర |
| ప్రిన్సిపాల్ | : శ్రీ టి. ఎస్. గోపాల్ |
| అధ్యాపక ప్రతినిధి | : శ్రీ కె. గంగారాం చౌదరి |

రీజనల్ జాయింట్ డైరక్టర్ ఆఫ్ హయ్యర్ ఎడ్యుకేషన్.

## Rolling Tropies In Andhra Kesari

### JUNIOR COLLEGE, RAJAMAHENDRI.

1 English Debate
2 Telugu Dabate
3 Telugu Elocution
4 Light Music (Vocal)
5 Karnatic Music (Vocal)
6 Telugu Essay Writing
7 Humanities Quiz
8 Scince Quiz
9 Sports & Games Championship For Boys
10 Sports & Games Championship For Girls.

## AWARDS

1 బలభద్రి వెంకటరమణ మెమోరియల్ అవార్డు
2 ప్రొ॥ బయ్యా వేంకట సూర్యనారాయణ అవార్డు
3 పొంగిపల్లి సత్యనారాయణ మెమోరియల్ అవార్డు
4 వాడ్రేవు శ్రీనివాస్ మెమోరియల్ అవార్డు
5 డి. వి. వి. సూర్యనారాయణ స్కాలర్‌షిప్
6 కీ॥ శే॥ కొవ్విడి లింగరాజు మెమోరియల్ అవార్డు
7 కీ॥ శే॥ గంధం సీతారామాంజనేయులు అవార్డు
8 డా. ఎ. బి. నాగేశ్వరరావు మెమోరియల్ అవార్డు
9 వి. వి. వి. సత్యనారాయణ మెమోరియల్ అవార్డు.

# కృతజ్ఞతలు.

1500— ఆంధ్రకేసరి సెంటనరీ జూనియర్ కాలేజి;
1116— డా॥ పోరంకి దక్షిణామూర్తి
1001— శ్రీ రేమెళ్ళమురళి మరియు పల్లిపాలెం గ్రామస్థులు.
400— ఐ. పోలవరం గ్రామస్థులు
300— శ్రీ తుమ్మిడి రాకుమార్ - ప్రకటన ;
116— శ్రీయుతులు వై. యస్. నరసింహారావు - విశ్వనాథ గోపాల కృష్ణ - వేదులగోవిందవర్మ - ఎమ్. వి. ఆర్. చారి (చిరంజీవి) మద్దుల వాసుదేవమూర్తి - గంధం నాగ సుబ్రహ్మణ్యం మహేంద్రవాడ పల్లయ్యపంతులు - పెమ్మరాజు గోపాలకృష్ణ- సాధనాల వెంకటస్వామి నాయుడు.
101— శ్రీయుతులు ప్రభాకర శ్రీకృష్ణభగవాన్ - కనకదండి సూర్య నారాయణ కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ - సన్నిధానం నరసింహశర్మ శ్రీమతి ఎ. ఎస్. వి. కుహలక్ష్మి - లింగమల్లు సావిత్రిదేవి - వాయుగుండం లక్ష్మి - కె. చంద్రమతి.
100— కుమారి కె. యశోదకుమారి. పి. సుభద్ర - శ్రీయుతులు మైలవరపు సాంబ శివరావు తమ్మన నరసింహారావు [జాలి] బి. పి. వెంకటాద్రిజు డా॥ ఎ. నారాయణరావు డా॥ డి. యస్ వి. సుబ్రహ్మణ్యం డా॥పరిభల సుబ్రహ్మణ్య శర్మ - పి. రఘునాథ్ షేక్ అసదుల్లాఅహ్మద్ భమిడిపాటిసూర్యనారాయణ డి. యస్. రాజేశ్వరరావు జి.వి.ఎస్.పి. పూర్ణానందరావు టి. వి. గోపాలకష్ణ సి. బి. వి. ఆకి. కె. శర్మ కాకర్లపూడి నారాయణరాజు సి. హెచ్. ఎస్. రమణీకుమారి
58— శ్రీయుతులు పి. కృష్ణమూర్తి డా॥ పి. వి. మురళీకృష్ణ డా॥టి.నాగమణి-అల్లంరాజు కామేశ్వరరావు-పాటూరివెంకటసత్య నారాయణ ఎస్. ఎఫ్. ప్రసాదరావు.

"మధుజీవనం" ముద్రణకు ఆర్థికముగా సహకరించిన వీరందరికీ మా సమితి తరపున కృతజ్ఞతాంజలులు సమర్పించుకొంటున్నాము.

సేవాభిలాషతో,
పెరువహాళ్ళ రఘునాథ్,
ప్రధాన కార్యదర్శి,
ఆంధ్రకేసరి యువజన సమితి.

# కవిని గూర్చి



★ శ్రీ కడిమిళ్ళ వరప్రసాద శతావధాని

★ భాషా ప్రవీణ. ఎమ్.ఏ.

★ తెలుగు పండితులు, టేలర్ హైస్కూలు, నర్సాపురం, పశ్చిమగోదావరి.

★ తల్లి దండ్రులు: శ్రీమతి భారతి, శ్రీ వేంకట రామయ్య శాస్త్రి

★ అనేక అష్టావధానములు, శతావధానములు, చతుర్గుణిత అష్టావధానము, నేత్రావధానములు మొదలగునవి చేసిరి.

★ నిర్వహించిన ప్రదేశములు: ఆంధ్ర, తమిళనాడు, కర్ణాటక, మహారాష్ట్ర, పశ్చిమ బెంగాల్ రాష్ట్రములు, ఢిల్లీ.

★ బిరుదములు: భారతీపుత్ర, అవధాన సార్వభౌమ, అవధానచూడామణి, శతావధాన చక్రవర్తి, అవధాన కళానిధి.

★ రచనములు: సంగమేశ్వర శతకము, చింతాంబికాష్టకము, మనజాతి, మాది లంచాలజాతి, మధుర మంజీర, స్పెషల్ టీచర్, ప్రసంగ భారతి

★ గురువులు: శ్రీ త్రిపురానందనాథ, శ్రీ శ్రీపాద లక్ష్మీనారాయణ, శ్రీమాన్ అత్తిలి గోపాలకృష్ణమాచార్యులు, కీ.శే. రావూరి వేంకటేశ్వరులు.

Title printed by ESWAR OFFSET Rajahmundry Phone 75373